# జీహాద్

## అంటే

# యుద్ధమా?




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



# జీహాద్

## అంటే

# యుద్ధమా?

అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూ (హిందూ) ధర్మప్రదాత,
సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము-36 ప్రథమ ముద్రణ : సం॥ 2014

ప్రతులు : 1000 వెల : **55/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా)
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్టికర్తకోడ్-963.
39) మతము-పథము.
40) ప్రబోధానందం నాటికలు.
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత.
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.
59) ధర్మశాస్త్రము ఏది?
60) మత మార్పిడి దైవద్రోహము.
61) త్రైతశక పంచాంగము.
62) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
63) స్వర్గము ఇంద్రలోకమా!-
నరకము యమరాజ్యమా!!
64) జీహాద్ అంటే యుద్ధమా?

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.

53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
88. ఏది శాస్త్రము?
89. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
90. 6-3=6.
91. గుర్తింపబడనివాడు గురువు.
92. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
93. చంద్రాకారము (బట్టతల).
94. మతములలో పవిత్రయుద్ధము.



# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

ఇ.నెం.76/97/29, కోట్లనగర్ ప్రక్కన,
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9502932941.

*****

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (ప్ర.సభ్యుడు)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూడు రోడ్, దర్గామాన్యం, గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి.
Cell : 9491773455, 9032903955.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) – 531162.
Cell : 9441567394, 9502172711.

*****

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
బుధవారము మార్కెట్, భీమవరం–1,W.G
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా–515511.
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నేతాజిరోడ్డు కుప్పం,చిత్తూరు జిల్లా.
Cell : 9652755110, : 9440305700

# జీహాద్ అంటే యుద్ధమా?

దేవుడు భూమిమీద ముఖ్యముగా మూడు మతములను సృష్ఠించాడు. భూమిమీద ఇంకా కొన్ని మతములున్నా జ్ఞానరీత్యా ముఖ్యమైనవి మూడు మతములనియే చెప్పవచ్చును. ఒక యంత్రములో పొట్టును, రాళ్ళను, నూకలను, స్వచ్ఛమయిన గింజలను వేరుచేయుటకు మూడు రకముల జల్లెడలను ఉంచినట్లు దేవుడు సాత్త్వికులు, రాజసులు, తామసులు అను వారినుండి స్వచ్ఛమయిన జ్ఞానిని వేరుచేయుటకు హిందూ, క్రైస్తవ, ముస్లీమ్‌లను మూడు మతములను దేవుడు ఏర్పరచడము జరిగినది. ఈ మూడు మతములు జ్ఞానమునిచ్చి జ్ఞానిగానయినా చేయగలవు, లేక మూడు మతములు మాయగా తయారై మనిషిని అజ్ఞానమువైపు అయినా పంపగలవు. తనకు ఇష్టమొచ్చిన వారిని జ్ఞానమార్గము వైపుకు పంపుటకు, ఇష్టము లేని వారిని అజ్ఞానమార్గమువైపు పంపుటకు దేవుడే ఈ విధముగా మూడు మతములను తయారు చేశాడు. మూడు మతములలో ఏ మతమునందున్న వాడైనా, జ్ఞానమువైపు పోవుటకు కావలసిన జ్ఞానమును అందించుటకు, ఆ మతములో ముందే ఒక దైవగ్రంథమును ఉంచడము జరిగినది. ఆ మతములోనున్న గ్రంథములోని జ్ఞానము అర్థమయితే జ్ఞానమువైపు, అర్థము కాకపోతే అజ్ఞానమువైపు మనిషి పోగలడు. మనిషి దైవగ్రంథములోని విషయములను చూచి జ్ఞాని కావచ్చును, అజ్ఞాని కావచ్చును.

దైవగ్రంథమును చూచినా! మనిషి అజ్ఞానమువైపు పోవుటకు అవకాశమున్నట్లు, దైవగ్రంథములో కూడా అక్కడక్కడ కొంత అజ్ఞానము కనిపించునట్లు దేవుడు ఏర్పాటు చేసియుంచాడు. మొదట అజ్ఞానముగా

కనిపించిన దానినిబట్టి దైవగ్రంథమును మొత్తము అజ్ఞానముగానే అర్థము చేసుకొను అవకాశము గలదు. అట్లే మొదటనే జ్ఞానముగా కనిపించిన దానినిబట్టి దైవగ్రంథమును మొత్తము జ్ఞానముగానే అర్థము చేసుకొను అవకాశము గలదు. ఈ విధముగా దేవుడు తనకిష్టమైనవారిని జ్ఞానమువైపు, తనకు ఇష్టము లేనివారిని అజ్ఞానమువైపు పంపుటకు అనుకూలముగా చేసి పెట్టుకొన్నాడు. దేవునిమీద ఇష్టము (శ్రద్ధ)యున్నవాడు తనకు ఇష్టుడనీ, శ్రద్ధలేనివాడు అయిష్టుడనీ దేవుడు ముందే తనగ్రంథములలో చెప్పాడు. దీనిప్రకారము మనిషిలోని ఇష్టత, అయిష్టతనుబట్టి మనిషి ఇటు జ్ఞానము వైపుగానీ, అటు అజ్ఞానమువైపుగానీ పోవుటకు అవకాశముగలదు. ఇదంతయూ గ్రంథములను చూచి జ్ఞానులుగా, అజ్ఞానులుగా తయారగు విధానము. ఆ విధముగా గ్రంథములను ఎందరు చూస్తున్నారు? వారిలో ఎందరు జ్ఞానులుగా తయారగుచున్నారని లెక్కించిన, నూటికి తొంభైమంది 90% దైవగ్రంథములను చూడడములేదు. కేవలము పదిమంది 10% మాత్రమే గ్రంథములను చూడగల్గుచున్నారు. అలా చూడగల్గినా చూచిన వారిలో వేయింటికి ఒకనికి కూడా దానిమీద శ్రద్ధయుండడము అరుదేనని చెప్పవచ్చును. దీని ప్రకారము కొన్ని లక్షలమందిలో ఒకడు మాత్రము దైవగ్రంథములలోని జ్ఞానమును తెలియగల్గును. అదే విధముగా కొన్ని లక్షలమందిలో పదిమంది మాత్రమే గ్రంథముల ద్వారా అజ్ఞానమార్గములో నడుచుకొంటూ, మేము గ్రంథములను చదివి నిజమైన జ్ఞానమును తెలుసుకోగలిగాము అని అనుకొనుచుందురు. ఇట్లు గ్రంథముల ద్వారా అజ్ఞానములోయున్నవారు, తాము జ్ఞానములో యున్నామని భ్రమించుచూ, గ్రంథములను చదువని సామాన్య ప్రజలకు తమ అజ్ఞానమును అంట గట్టుచున్నారు.

కొన్ని లక్షలమందిలో ఒకడు జ్ఞానిగా మారినా, వాడు బయట మనుషుల సంబంధము పెట్టుకోకుండా తనమార్గములో తాను పోవు చుండును. అయితే మేము జ్ఞానులము అని భ్రమించుచుండువారు సాధారణ మనుషులతో సంబంధము పెట్టుకొని తమకు తెలిసిన జ్ఞానమును చెప్పు చుందురు. అటువంటప్పుడు చెప్పువానిలోవుండు అజ్ఞానము వినేవాని లోనికి కూడా ప్రవేశించును. అందువలన వినేవాడు కూడా అజ్ఞానిగా మారిపోవు అవకాశముగలదు. నేడు మూడు మతములలోనూ తమ గ్రంథములను చదివి, తాము అందులోని జ్ఞానమును తెలుసుకొన్నామని అనుకొనువారు మతపెద్దలుగా, గురువులుగా ఆయా మతములలో చలామణి అగుచున్నారు. సామాన్య మనుషులకు ఆయా మతగ్రంథముల జ్ఞానమును బోధిస్తామని అనుకొని, మతగ్రంథములలోని జ్ఞానమును కాకుండా మతముల జ్ఞానమును బోధించుచున్నారు. అప్పుడు ఆ బోధలను వినిన ప్రజలందరూ గ్రంథముల లోని దైవజ్ఞానమును కాకుండా, గ్రంథములలోలేని మతజ్ఞానమును తెలుసుకొని తాము మతమువైపు పోవుచున్నారు తప్ప, దేవునివైపుగానీ దేవుని జ్ఞానమువైపుగానీ పోవడము లేదు. ఆయా మతములలో గురువులుగా, మతపెద్దలుగాయున్నవారు ఏమీ తెలియని ప్రజలకు తమకు తెలిసినది బోధించుచూ వారికి మార్గదర్శకులుగా యున్నారు. అంతేకాక తమ మాటను జవదాటకుండా మతము అను త్రాడుతోకట్టివేసి, వారి ఇష్టమొచ్చినట్లు మొత్తము సమాజమును నడిపించు చున్నారు.

ఏ మతములో అయినాగానీ, ఆ మతపెద్దలు చెప్పినట్లు మతస్థు లందరూ నడుచునట్లు ఏర్పాటు చేసుకొన్నారు. మతపెద్దలు చెప్పినవే ఆ

మత సాంప్రదాయములుగా లెక్కించబడుచున్నవి. మతపెద్దలు చెప్పినట్లు వినకపోతే మతధిక్కారమవుతుందను భయముతో కొందరూ, పాపము వస్తుందేమోనని కొందరూ, దేవునికి కోపమొస్తుందేమోనని కొందరూ, మత ప్రజలందరిలో వ్యతిరేఖము వస్తుందేమోనని కొందరూ, మతాచారమును కాదంటే ఏమి కష్టమొస్తుందేమోనని కొందరూ, మతపెద్దలు చెప్పినట్లు వినకపోతే వారు మతమునుండి బహిష్కరిస్తారేమోనను భయముతో కొందరూ, మతపెద్దలు చెప్పినట్లు నడుచుకోవడము జరుగుచున్నది. మత పెద్దలుగాయున్నవారికి వారి మతగ్రంథములలోని విషయములు అర్థమైనాయని చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! మతపెద్దలు చెప్పు సాంప్రదాయములు ఒక్కటి కూడా మతగ్రంథములలో లేకపోవడమే దానికి నిదర్శనము. ఉదాహరణకు హిందువుల సాంప్రదాయములలో ఏ ఒక్కటి కూడా హిందువుల దైవగ్రంథమయిన భగవద్గీతలో లేవు. మనిషి చనిపోయినప్పుడు, హిందువులలో సాంప్రదాయము ప్రకారము, కర్మ కాండములను పేరుతో కొన్ని పనులు చేయడము జరుగుచున్నది. అవన్నియూ హిందువులు వారి సాంప్రదాయములుగా వాటిని వ్రాసు కొన్నారు గానీ, ఆ పనులు భగవద్గీతలో చెప్పలేదు. హిందువుల (ఇందువుల) జీవన విధానములో ఎన్నో పద్ధతులు ఆచరణల రూపములో గలవు. అలావున్న ఆచరణలన్నిటినీ సాంప్రదాయములు అని చెప్పడమే కాకుండా, ఇవి హిందువులవియని అందరికీ తెలియునట్లు వాటికి "హిందూ సాంప్రదాయములు" అని పేరు పెట్టడము జరిగినది.

ఈ విధముగా ప్రతి మతమునకు సాంప్రదాయములు గలవు. అయితే కొన్ని సాంప్రదాయములు జ్ఞానమునకు దగ్గరగాయుండవచ్చును

గానీ, దైవజ్ఞానము ఎంతమాత్రము కావు. హిందువులలో పూర్వము ఎన్నో సాంప్రదాయములు ఉండేవి. అయితే కాలక్రమేపీ అవి కొన్ని లేకుండా పోయి కొన్ని మాత్రము మిగిలాయి. పూర్వమున్న హిందూ సాంప్రదాయము లలో దాదాపు యాభై సంవత్సరాల పూర్వము ఒక సాంప్రదాయము ఉండేది. అది ఇప్పుడు యాభై సంవత్సరములనుండి కనిపించడములేదు. నా చిన్నవయస్సులో ఆ సాంప్రదాయమును ఆచరించువారిని నేను చూశాను. ఒక ముఖ్యమైన కార్యనిమిత్తము బయటికి పోవు హిందువులు, తాము నివసించుచున్న ఇంటి ముఖద్వారమువద్దయున్న గడపకు నమస్కారము చేసుకొని పోయెడివారు. పురుషులు ఇంటి గడపను కన్నతల్లిగా భావించి నమస్కరించడమేకాక, స్త్రీలు గడపను లక్ష్మీదేవిగా భావించి ఉదయము, సాయంకాలము సంధివేళలో పూజించెడివారు. ప్రస్తుత కాలములో మగవారు ఇంటిగడపకు మ్రొక్కడము కనిపించడము లేదుగానీ, స్త్రీలు అక్కడక్కడ పల్లెటూర్లలో ఇప్పటికీ ఇంటిముందర నీళ్ళుచల్లి, ముగ్గువేసి గడప దగ్గర అగరుబత్తీలు ముట్టించి గడపకు పసుపు, కుంకుమ బొట్లు పెట్టి నమస్క రించడము జరుగుచున్నది. పూర్వము హిందువుల కుటుంబము లన్నియూ ఉదయము సాయంకాలము ఇంటిగడపకు నమస్కరించడము ముఖ్యమైన సాంప్రదాయముగా పెట్టుకొని ఆచరించెడివారు.

ఈ విధముగా అన్ని మతములలోనూ వారి మతపెద్దలు ఏర్పరచిన సాంప్రదాయములు, వారివారి మతములకు తగినట్లు వేరువేరుగా ఉండేవి. వారివారి మతమును బలపరచుకొనుటకూ, మతములలోయున్నవారు అదే మతములో ఉండుటకూ, అన్ని మతములకంటే తమ మతము గొప్పదని ప్రకటించుకొనుటకూ, మతములోని వారు మతమును వీడి పరమతము

లోనికి పోకుండుటకూ సాంప్రదాయములను తయారు చేసుకొన్నారు. ఒక రాజ్యమునకు ఒక గుర్తింపు జెండా (పతాకము) ఉన్నట్లు, మతమునకు పతాకములున్నట్లు సాంప్రదాయములు ఉండేవి. ఒక జెండాను చూచి ఇది ఫలానా దేశమువారిదని మనము గుర్తించినట్లు, ఒక సాంప్రదాయ ఆచరణను చూచినప్పుడు ఇది ఫలానా మత సాంప్రదాయము అని గుర్తించునట్లు, అన్ని మతములకు సాంప్రదాయములను ఆయా మతపెద్దలు తయారు చేశారు. ఎన్ని మతములలో, ఎన్ని సాంప్రదాయములున్నా అవన్నియూ మనుషులు తయారు చేసినవే అయినందున, వాటిలో దేవుని జ్ఞానము లేదని చెప్పవచ్చును. దేవుడు చెప్పిన గ్రంథములలో జ్ఞానమున్నది గానీ, మనుషులు చెప్పిన సాంప్రదాయములలో జ్ఞానములేదని చెప్పవచ్చును. జ్ఞానము లేకపోవడమే కాకుండా, దేవుని జ్ఞానమునకు వ్యతిరేఖమయిన అధర్మములు సాంప్రదాయములలో కనిపించుచున్నవి.

సాంప్రదాయములలో అజ్ఞానము ఎలా ఉన్నదని చెప్పుటకు ఉదాహరణగా హిందువుల సాంప్రదాయమైన ఇంటి గడపకు నమస్కరించ డమను ఆచరణను తీసుకుని చూస్తాము. ఇంటిగడపను ఒక దేవతగా పోల్చి మ్రొక్కడము వలన, అగరుబత్తీలతో పూజించడము వలన, దేవున్ని వదలి దేవుడు సృష్ఠించిన దేవతలను మ్రొక్కినట్లగుచున్నది. అలా చేయుట వలన భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానమునకు వ్యతిరేఖముగా ప్రవర్తించి నట్లగుచున్నది. **"దేవతలను మ్రొక్కువారు నన్నుచేరలేరు"** అని భగవంతుడు చెప్పినమాటకు విలువ ఇవ్వకుండా దేవతలను మ్రొక్కి దేవున్ని వదలు కొన్నట్లగుచున్నది. ఇంటిగడపకు మ్రొక్కు హిందూసాంప్రదాయము ఏ విధముగా చూచినా, అజ్ఞానమునకు సంబంధించినదిగానే కనిపిస్తున్నది

తప్పు జ్ఞానముగా కనిపించడములేదు. ఇదే విధముగా అన్ని మతముల లోనూ ఆయా మతసాంప్రదాయములుగలవని తెలియుచున్నది. సాంప్రదాయములు ఏ ఒక్క దైవగ్రంథముతోనూ సంబంధములేవు. మనుషులయిన మత పెద్దలు తెల్పిన సాంప్రదాయములు ఏ విధముగానయినా దేవుని జ్ఞానమునకు విరుద్ధముగానేయున్నవి. కొన్ని సాంప్రదాయములు దేవునికి దగ్గరగా యున్నట్లు కనిపించినా, చివరికవి దేవునికి దూరముగానే ఉన్నాయి. ముఖ్యముగా సాంప్రదాయములనునవి క్రైస్తవ సమాజములోకంటే ఎక్కువగా హిందువులలోనూ, ముస్లీమ్‌లలోనూ కనిపించుచున్నవి. హిందువులలో పూర్వముండి ఇప్పుడు లేకుండా పోయినవి ఎన్నో సాంప్రదాయములుండగా, ముస్లీమ్‌లలో హిందువులకంటే ఎక్కువ సాంప్రదాయములున్నవనీ, పెద్దలు చెప్పిన సాంప్రదాయములను వారు తప్పక ఆచరించుచున్నారని అర్థమగుచున్నది.

హిందువులలో పెద్దలు పెట్టిన సాంప్రదాయములు ఎన్నో కను మరుగైపోయాయి. అయితే ముస్లీమ్ సమాజములో వారి పెద్దలుంచిన సాంప్రదాయములలో ఏ ఒక్కటికూడా పోకుండా అన్నీ ఆచరించబడు చున్నవి. ముస్లీమ్‌ల జీవితములో సాంప్రదాయములు పూర్తిగా కలిసిపోయి వుండుట వలన, వారి జీవిత విధానమంతయూ సాంప్రదాయమయమై పోయినది. ఉదాహరణకు ముస్లీమ్ పురుషులు మేము ముస్లీమ్ పురుషులము, మా జీవిత విధానమిదియన్నట్లు, గడ్డము పెంచియుందురు. అట్లే ముస్లీమ్ స్త్రీలు మేము ముస్లీమ్ స్త్రీలము, మా జీవిత విధానమిది యన్నట్లు శరీరమంతా నల్లటి ముసుగు ధరించి కనిపించుచుందురు. వాస్తవముగా ముస్లీమ్‌ల సాంప్రదాయములయిన మగవారి గడ్డముగానీ,

ఆడవారి ముసుగుగానీ ముస్లీమ్ మతపెద్దలు ఏర్పరచినవేగానీ దేవుడు చెప్పినవి ఏమాత్రముకావు. ముస్లీమ్‌లు మా గ్రంథమని చెప్పుకొను ఖుర్‌ఆన్ గ్రంథములో ఎక్కడగానీ ముస్లీమ్ అయినవారు గడ్డము ధరించవలెననిగానీ, స్త్రీలు ముసుగు ధరించవలెననిగానీ లేదు. దైవగ్రంథమని పేరుగాంచిన ఖుర్‌ఆన్ గ్రంథములో ముస్లీమ్ సాంప్రదాయములు ఒక్కటికూడా లేవు. అందువలన సాంప్రదాయములను ఆయా మతస్థులు తయారు చేశారుగానీ, దేవుడు చెప్పలేదని తెలియుచున్నది. దేవుడు చెప్పినది దైవ జ్ఞానమగును. మనుషులు చెప్పినది దైవజ్ఞానము క్రిందికి జమకట్టబడదు. దైవజ్ఞానము కాని సాంప్రదాయములు ప్రపంచములో ఒక పద్ధతయిన జీవిత విధానమును చూపుచున్నవిగానీ, దైవజ్ఞానమును చూపలేవు. అందులో దైవ జ్ఞానముండదు. సాంప్రదాయములకూ దైవజ్ఞానమునకూ ఎటువంటి సంబంధమూ ఉండదు. ఇదంతయూ ముస్లీమ్‌ల సాంప్రదాయముల విషయము.

హిందువుల సాంప్రదాయ విషయములోనికివస్తే, హిందూ సాంప్రదాయములు కూడా దైవ గ్రంథమయిన భగవద్గీతలో చెప్పబడలేదు. అందువలన హిందూసాంప్రదాయములకు దైవజ్ఞానమునకు సంబంధము లేదని చెప్పవచ్చును. అయితే ఇక్కడ కొంత వివరముగా తెలియవలసిన విషయమున్నది. అదేమనగా! కృతయుగములో మతముల ప్రసక్తేలేదు. మతములన్నీ కలియుగములో సృష్టించబడ్డాయి. కృత, త్రేతా, ద్వాపర యుగములలో మతముల ప్రసక్తి లేదు. కావున కృతయుగములోనే తయారయిన హిందూ (ఇందూ) సాంప్రదాయములు దైవజ్ఞానమును ఆధారము చేసుకొని తయారైనవి. మతము అనునది లేదు కావున, ఆ

రోజువున్నది ఇందూ సమాజము తప్ప ఇతర సమాజము ఏదీ లేనిదానివలన, మతము మీద ఆధారపడి సాంప్రదాయములను తయారు చేయలేదు. అందువలన హిందూ సాంప్రదాయములు జ్ఞానము యొక్క ఆధారము తోనే తయారయినవి. ఉదాహరణకు పెళ్ళి విషయములో ఆచరించు సాంప్రదాయములు భగవద్గీతలో లేకున్నా, జ్ఞానము యొక్క సారాంశమును ఆధారము చేసుకొని, సాంప్రదాయములలో జ్ఞానమే కనిపించునట్లు పెళ్ళి సాంప్రదాయములను తయారు చేశారు. అందువలన ఇందూ పెళ్ళిళ్లలో ఉన్న ఆచరణయంతయూ పూర్తిగా దైవజ్ఞానముతో కలిసియున్నాయి. ఇందూ సాంప్రదాయముల వలన దైవజ్ఞానము తెలియబడుచున్నదిగానీ, ప్రపంచ మతముగానీ, ప్రపంచ జ్ఞానముగానీ తెలియబడలేదు.

ద్వాపరయుగము తర్వాత వచ్చిన కలియుగములో మూడువేల సంవత్సరముల తర్వాత క్రైస్తవము వచ్చి, అది ఒక మతముగా లెక్కించ బడడము వలన, దానికంటే ముందుయున్న ఇందూ సమాజమును ప్రత్యేకముగా గుర్తించవలసివచ్చినది. తర్వాత ఆరువందల సంవత్సరము లకు వచ్చిన ఇస్లామ్ వలన ముస్లీమ్ మతము ఏర్పడినది. క్రైస్తవమతము, ముస్లీమ్ మతము ఏర్పడిన తర్వాత ఇందూ సమాజమునకు కూడా ఇందూ మతము అని పేరుపెట్టబడినది. కాలక్రమేపీ ఇందూమతము కొద్దిగా శబ్ధ మార్పిడితో హిందూమతముగా తయారయినది. ఏనాడో కృతయుగములో పుట్టిన ఇందూ సమాజమునకు హిందూమతమను పేరులేదు కావున ఇందూసాంప్రదాయములలో జ్ఞానముతప్ప మతములేదు. నేడు తయారయిన క్రైస్తవ, ముస్లీమ్ సమాజములలో మతప్రదర్శన తప్ప జ్ఞాన ప్రదర్శనలేదు. అందువలన ఆయామతములలోని అన్ని సాంప్రదాయము

లలో మతము కనిపిస్తున్నదిగానీ, దైవజ్ఞానము కనిపించడము లేదు. ఆయా మతములలో సాంప్రదాయములను వ్రాసుకున్న గ్రంథములు ప్రత్యేకించి గలవు. ముస్లీమ్ మతములో వారి సాంప్రదాయములను తెలియజేయు ప్రత్యేకమయిన "హదీసు" గ్రంథములు గలవు.

ఇందూ (హిందూ) మతములో సాంప్రదాయరూపములుగా యున్నవన్నియూ జ్ఞానముతో కూడుకొన్నవే వుండినప్పటికీ, తర్వాత వచ్చిన ముస్లీమ్, క్రైస్తవమతములను చూచి కొందరు హిందువులు తమ ఆచారములలో కొన్నిటిని చేర్చుకొని కట్టు, బొట్టు, జుట్టు వ్యవహారములను ప్రత్యేకించి తెచ్చుకొన్నారు. పూర్వమే కట్టు, బొట్టు, జుట్టు హిందువులలో ఉండినా అవి జ్ఞానముతో కూడుకొనియుండేవి. అయితే ద్వాపరయుగము తర్వాత కలియుగములో మూడు వేలసంవత్సరముల తర్వాత, ఇప్పటికి రెండు వేల సంవత్సరములనుండి కట్టు, బొట్టు, జుట్టు విషయములలో కొంతమార్పు వచ్చి ఇవి మతమునకు సంబంధించిన గుర్తులుగా చెప్పుకోవడము జరిగినది. పంచెకట్టు కుచ్చెళ్ళ మడుపులో మార్పువచ్చినది. పూర్వము ఏడు మడతల కుచ్చెళ్ళను పంచెకట్టులో మగవారూ, చీరకట్టులో ఆడవారూ పెట్టడము జరిగెడిది. నేడు ఏడుమడతల సాంప్రదాయము పోయినది. దానివలన హిందువులలో పంచెకట్టు, చీరకట్టు నేడు మత సాంప్రదాయముగావున్నదని చెప్పవచ్చును. అట్లే నేడు ఇందూ సాంప్రదాయములు కూడా జ్ఞానము యొక్క గాడితప్పి మత గుర్తింపునకే అన్నట్లున్నవి. నేడు మేము మతపెద్దలమని చెప్పుకొను బ్రాహ్మణులవద్దనే కట్టు, బొట్టు, జుట్టు అర్థము లేని ఆచారములుగా ఉన్నాయి. అయినప్పటికీ మిగతా కొన్ని కార్యములలో జ్ఞానముతో కూడుకొన్న సాంప్రదాయములు

చెడని ఆచారములుగా నేటికీ యున్ననూ, వాటి అర్థమును తెలియనిస్థితిలో హిందువులున్నారు. అర్థము తెలియని ఆచారములు మిగిలియున్నందుకు కొంతవరకు సంతోషించవచ్చును. ఎందుకనగా! ఆచారములుంటే ఏనాటికయినా వాటికి అర్థములు తెలియగలవు. తెలియజెప్పువారు తప్పకవస్తారు.

క్రైస్తవులలోనూ, ముస్లీమ్‌లలోనూ ఉన్న ఆచారములు ఏమాత్రమూ జ్ఞానసంబంధమైనవి కాకుండా, కేవలము మత సంబంధమైనవే అగుట వలన, వాటికి భవిష్యత్తులో జ్ఞానసంబంధ అర్థము తెలియునను ఆశకూడా వారికిలేదు. ముస్లీమ్‌లలో మగవారు కట్టుకొను లుంగీగానీ, పైజామాగానీ మడిమలకంటే లేక పాదములకంటే ఆరు అంగుళములు పైకి ఉండాలి. వారి జీవిత విధానములో ఇది గుడ్డల శుభ్రతకు సంబంధించిన విధానమే తప్ప దానివలన మరే ఇతర ప్రయోజనము లేదు. అది మిగతా మతముల వారు ఎవరూ చేయకుండా ఒక్క ముస్లీమ్ మతమువారే విధిగా చేయుట వలన అది ముస్లీమ్‌ల సాంప్రదాయమైనది. ముస్లీమ్‌ల పెద్దలు చెప్పిన సాంప్రదాయములను ముస్లీమ్‌లు విధిగా ఆచరించాలి. అలా ఆచరించక పోతే మతము బలహీనమవుతుందని వారి పెద్దలు చెప్పుచుందురు. అంతేకాక వారి ఆచరణను, సాంప్రదాయములను చూచిన వెంటనే వీరు ముస్లీమ్ మతమువారని గుర్తించునట్లుగా ఉందురు. ఎక్కువగా వారి ఆచరణలన్నీ మతముతో ముడిపడియున్నందున ఆ మతములోని వారందరూ ఇష్టమున్నా, ఇష్టము లేకపోయినా తప్పక ఆచరించవలసి యుండును. ఆచరించకపోతే మతపెద్దల కోపమునకు గురికావలసి వస్తుందనీ, దానివలన తమ సమాజము వారందరికీ వ్యతిరేఖముగా

కనిపిస్తామనీ, మతాచరణలు లేకపోతే మతము తమను వెలివేస్తుందనీ, భయపడిన ముస్లీమ్‌లు తప్పనిసరిగా తమ సాంప్రదాయములను ఆచరించు చున్నారు.

ముస్లీమ్‌లు ఆచరించు ఆచరణలలో గడ్డమును పెంచడము మొదలు కొని, ఒడుగులు (సున్తీ) చేయించుకొనుట వరకు ఇష్టము లేకపోయినా ఆచరించవలసి వస్తున్నది. కొందరు ముస్లీమ్‌లు తమ ఆచారములను ఇష్టముతో ఆచరించుచున్నా, ఇష్టము లేకున్నా ఆచరించువారు కూడా కొందరుండవచ్చును. ఇష్టముతో కూడుకొన్న ఆచారములైనా, ఇష్టముతో లేని ఆచారములైనా, ఒకటి కూడా అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథమున ఏమాత్రమూ లేవనియే చెప్పవచ్చును. ముస్లీమ్‌లకు మత గ్రంథముగా చెప్పబడు ఖుర్ఆన్ గ్రంథములో ముస్లీమ్‌ల సాంప్రదాయములు లేవని ముస్లీమ్‌లందరికీ తెలియదు. ముస్లీమ్‌లందరికీ తెలియకున్నా బహుకొద్దిమందికి మాత్రము ఖుర్ఆన్‌గ్రంథములో ఆచరణలను (సాంప్రదాయములను) గురించి దేవుడు చెప్పలేదని తెలుసు. అయితే అవన్నియూ హదీసు గ్రంథములలో ఉన్నవని కూడా తెలుసు. అయితే ముస్లీమ్‌లకు ఖుర్ఆన్‌కంటే హదీసులే ముఖ్యమైనవని వారి పెద్దలు చెప్పడము వలన అందరూ అట్లేనని అనుకొన్నారు. ముస్లీమ్‌లలో మగ వారికందరికీ ఖుర్ఆన్ గ్రంథముకంటే హదీసు గ్రంథమే ముఖ్యమనీ, అట్లే ఆడవారికి హదీసు గ్రంథముకంటే ఖుర్ఆన్ గ్రంథము ముఖ్యమనీ చెప్పడము జరిగినది. అందువలన తమపెద్దలు చెప్పినట్లు ఆడవారందరూ ఖుర్ఆన్ గ్రంథమును విధిగా చదువుచుందురు. మగవారందరూ మస్జీద్‌లలో బోధించు హదీసు గ్రంథ వాక్యములను వినుచుందురు.

ఈ విధముగా ముస్లీమ్ సమాజములోని సామాన్య ముస్లీమ్‌లందరూ దేవుడు, మతము అను భయముచేత కట్టబడియున్నారు. మతమును అతిక్రమించితే దేవునిమాటను అతిక్రమించినట్లేననీ, దేవునిమాటను అతిక్రమించితే నరకము తప్పదనీ, దేవుని మాటను అతిక్రమించకుండా నడుచుకుంటే స్వర్గమునకు పోతామనీ, ముస్లీమ్ పెద్దలు చెప్పడము వలన అదే సత్యమని కొందరు నమ్మియుండగా, స్వర్గము వచ్చుట సత్యము కాదేమో! అని అనుకొనువారు, నరకము వస్తుందను భయముతో తప్పనిసరిగా వారి పెద్దల మాటలకు కట్టుబడి ఏమి చెప్పితే అది ఆచరించుచున్నారు. ముస్లీమ్‌ల భయము ముస్లీమ్ పెద్దలకు తమ చేతిలో ఆయుధముగా ఉండగా, దానిని చూపి భయపెట్టుచూ తాము చెప్పినట్లు ముస్లీమ్‌లందరూ చేయు విధముగా ముస్లీమ్‌లను మార్చుకొన్నారు. అందువలన వారిపెద్దలు చెప్పినట్లు తూ.చ. తప్పక ఆచరించు క్రమశిక్షణగల మతము ముస్లీమ్ మతమని పేరుగాంచినది. అంతేగాక "ఏకేశ్వరోపాసన" అను మార్గములోనే నడుచు ఏకైక మతముగా కూడా ముస్లీమ్ మతము పేరుగాంచినది.

ముస్లీమ్‌లందరికీ నరకము మీద ఎట్లు భయమున్నదో, దేవుని మీద కూడా అట్లే విశ్వాసము కూడా కలదు. ముస్లీమ్ మతములో అన్నిటి కంటే మించియున్న ఒకేఒక మంచి లక్షణము ఏకేశ్వరోపాసన. నరకము మీద భయమున్నట్లే దేవునిమీద శ్రద్ధకూడా కలదు. దేవునిమీద శ్రద్ధ యుండుటనుబట్టి వారికి ఏకేశ్వరోపాసన మీద విశ్వాసము ఏర్పడినదనియే చెప్పవచ్చును. దేవునిమీద గల విశ్వాసముతో దేవునికొరకు ఎటువంటి శ్రమయైనా పడుటకు ముస్లీమ్‌లు సిద్ధముగాయున్నారని ఒప్పుకోక తప్పదు. అటువంటప్పుడు దేవుని జ్ఞానమును ఎంతకష్టపడియైనా తెలుసుకొని దాని

ద్వారా దేవునివద్దకు చేరాలన్న మంచి ఉద్దేశ్యము ముస్లీమ్‌లదని చెప్పవచ్చును. అయితే వారు అనుకొన్న ఉద్దేశ్యము ఒక విధముగా నెరవేరలేదు. ముస్లీమ్‌లలోయున్న పట్టుదలను ముస్లీమ్ పెద్దలు మతము వైపు వినియోగించడము వలన, అదే జ్ఞానమార్గమని మిగతా ముస్లీమ్ లందరూ తలచుట వలన, దేవునిమీద చూపవలసిన శ్రద్ధను మతము మీద చూపుట వలన చాలా పొరపాటు జరిగిపోయిందని చెప్పవచ్చును. దాని కారణమున ముస్లీమ్‌లకు మతము తెలిసినంతగా దేవుడుగానీ, దేవుని జ్ఞానముగానీ తెలియలేదు.

**ఖుర్ఆన్ గ్రంథములో 30 పారాలలో 114 సూరాలు గలవు. 114 సూరాలలో 6236 ఆయత్‌లు (వాక్యములు) గలవు. 6236 ఆయత్‌లలో కనీసము 236 వాక్యములను అర్థము చేసుకోగల్గినా ఖుర్ఆన్‌లోని దైవ జ్ఞానము పూర్తి అర్థముకాగలదు.** ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమును ఖగోళములో గ్రహముగాయున్న జిబ్రయేల్ అను మహాజ్ఞాని ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమని తెలియుచున్నది. అందువలన జిబ్రయేల్ చెప్పిన జ్ఞానము స్వచ్ఛమయిన దైవజ్ఞానమని తెలియుచున్నది. జిబ్రయేల్ అప్పటి కాలములో మనుషులయందు ఉత్తముడయిన ముహమ్మద్ ప్రవక్తగారిని ఎన్నుకొని ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పడము జరిగినది. ప్రవక్తగారు చదువురాని వారయిన దానివలన విన్న జ్ఞానమును ఇతరులకు చెప్పెడివాడు. ఆ విధముగా 23 సంవత్సరములు కొనసాగింది. 23 సంవత్సరములు జిబ్రయేల్ ద్వారా వినిన జ్ఞానమును **“ఖుర్ఆన్”** అను పేరుతో ఇతరుల ద్వారా వ్రాయించాడు. 23 సంవత్సరములనుండి వినిన జ్ఞానమును ఎవరికి

జ్ఞాపకమున్నది వారు వ్రాయడము జరిగినది. ఈ విధముగా ఒక ముహమ్మద్ ప్రవక్తగారి చేతనే కాకుండా, ఇతరుల ద్వారా కూడా సేకరించబడిన వాక్యములను గ్రంథములోనికి ఆనాటి భక్తులు వ్రాయడము జరిగినది. ఆనాడు ముహమ్మద్ ప్రవక్తగారు నిరక్షరాస్యుడు అయినందున కొందరు కలిసి ఖుర్ఆన్ గ్రంథమును వ్రాయడము జరిగినది. ఆనాడు ప్రవక్తగారు చెప్పిన జ్ఞానమును ఎందరో విన్నవారుండుటచేత వారికి జ్ఞాపకమున్నవి, అర్థమయినవి వారు వ్రాయగా, ప్రవక్తగారు మాత్రము తనకు జ్ఞాపకమున్నవి తాను చెప్పి వ్రాయించాడు. **నేడు ఖుర్ఆన్‌లోని 6236 వాక్యములుండగా 6000 వాక్యములను ఇతరులు వ్రాసియున్నా ప్రవక్తగారు 236 వాక్యము లయినా స్వయముగా వ్రాయించి యుండును.** ఖుర్ఆన్‌లోని మొత్తము వాక్యములను 23 సంవత్సరములలో ప్రవక్తగారు చెప్పియుండగా, వాటినే ఇతరులు ఖుర్ఆన్ గ్రంథములో వ్రాయగా, అలా వ్రాయునప్పుడు రెండువందలకు పైగా వాక్యములను ప్రవక్తగారు స్వయముగా అప్పుడు చెప్పి వ్రాయించాడని నమ్ముచున్నాము. ఎందుకనగా! ఖుర్ఆన్ గ్రంథములోని 6236 వాక్యములలో అత్యంత ఉత్తమమైనవి, అతి రహస్యమైనవీ రెండు వందలకు పైగా కలవు. అంత గొప్ప వాక్యములను తిరిగి రెండవమారు ప్రవక్తగారు చెప్పియుందురని, అంతపెద్ద వాక్యములను ఇతరులు చెప్పి యుండలేరని అనుకొంటున్నాము.

రహస్యములలోకెల్లా రహస్యములయిన ఆ వాక్యములను ప్రవక్త గారు తప్ప ఇతరులు చెప్పుటకు అవకాశములేదని తెలియుచున్నది. అయితే నేడు ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ గ్రంథము ఎంతమటుకు అర్థమయినదోగానీ, పూర్తి అర్థము కాలేదని మాత్రము చెప్పవచ్చును. సామాన్య ముస్లీమ్‌లు

ఖుర్ఆన్ గ్రంథమును చదువరు. ముస్లీమ్ స్త్రీలే ఎక్కువగా ఖుర్ఆన్ గ్రంథమును చదువుచున్నారు. అయితే ఖుర్ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలోనే చదువవలెను అను నియమము ఉండుట వలన, అరబ్బీభాష అందరికీ తెలియకపోవడము వలన, ఖుర్ఆన్ గ్రంథము అందరికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. నేడు ఖుర్ఆన్ గ్రంథము తెలుగు భాషలోనికి, మరి ఇతర భాషలలోనికి అనువదించబడియున్నా ముస్లీమ్‌లు మాత్రము మిగతా భాషలలో చదువకూడదు, అరబ్బీభాషలోనే చదువవలెనని వారి పెద్దలు చెప్పడము వలన, అరబ్‌దేశములో అరబ్బీభాష వచ్చిన వారికి తప్ప మిగతా దేశములలోని ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ గ్రంథము అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ముస్లీమ్‌లందరూ ఖుర్ఆన్ చదువలేదు కాబట్టి చదవని వారికి ఎటూ తెలియదు. అయితే ఖుర్ఆన్ చదివినవారికి అరబ్బీభాషరాదు కాబట్టి, వారికి కూడా తెలియదనియే చెప్పవచ్చును. ఇకపోతే అరబ్బీ భాషను నేర్చుకొన్నవారు మత పెద్దలుగాయుండుట వలన వారు తప్పక ఖుర్ఆన్ గ్రంథమును చదివియుందురు. అయితే భాషవచ్చి చదివినంతమాత్రమున వారికి ఖుర్ఆన్ గ్రంథము అర్థమయివుండునని చెప్పలేము. ఎందుకనగా! గ్రంథములోని ఆరువేల వాక్యములు అర్థమయినా ప్రవక్తగారు స్వయముగా చెప్పి వ్రాయించిన 236 వాక్యములు అర్థమయి వుండునని చెప్పలేము. ఖుర్ఆన్ గ్రంథములో ఆధ్యాత్మిక రహస్యమంతయూ రెండుమూడు వందల వాక్యములలో ఉండుట వలన, ఆ వాక్యములు పూర్తి అర్థమయివుండవని చెప్పవచ్చును.

ఇప్పుడు కొందరికి ఒక ప్రశ్నవచ్చి అడుగవచ్చును. అదేమనగా! నేడు ముస్లీమ్ పెద్దలలో ఎందరో పండితులు, జ్ఞానులు ఉండగా, వారికి

కూడా అర్థము కాలేదని మీరు ఎలా చెప్పగలరని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! ముస్లీమ్‌లలో ఎంతోమంది మేధావులు ఉండడము నేను కూడా చూశాను. వారి మేధాశక్తిని చూచి నేను స్వయముగా ఆశ్చర్యపోయిన సందర్భములు కూడా కలవు. వారికి ఎంతో జ్ఞాపకశక్తి యున్నా జ్ఞానశక్తి లేదని నాకు చాలామార్లు అర్థమయినది. వారి మేధాశక్తి నంతటినీ స్థూల విషయముల మీద మాత్రమే కేటాయిస్తున్నారు, సూక్ష్మ విషయములను వదలివేస్తున్నారు. దేవుని విషయమంతయూ సూక్ష్మ విషయము మీద ఆధారపడియున్నది. దేవుడు స్థూలమయినవాడు కాడు. ఆయన కంటికి కనిపించడు. అటువంటి దేవున్ని స్థూల దృష్ఠితో చూస్తే ఎలా తెలియగలడు? మేధావులందరూ సూక్ష్మమును వదలి స్థూలముగా చూచుట వలన, వారికి దేవుని విషయము అర్థముకాలేదని చెప్పవచ్చును. **ఖుర్‌ఆన్ గ్రంథములో మూడవ (3) సూరాలో ఏడవ (7) ఆయత్‌నందు స్థూల, సూక్ష్మ విషయములను గురించి జిబ్రయేల్ చెప్పడము జరిగినది.** దేవుడు సూక్ష్మమైనవాడు గనుక దేవుని జ్ఞానము చాలా భాగము సూక్ష్మ జ్ఞానముతో కూడుకొనియుండును. ఒక లెక్కప్రకారము 40 శాతము స్థూలజ్ఞానము, 60 శాతము సూక్ష్మ జ్ఞానము దైవగ్రంథములలో గలదని తెలియుచున్నది. మరియొక లెక్కప్రకారము 25 శాతము స్థూలము, 75 శాతము సూక్ష్మముతో దేవుని జ్ఞానముకలదని తెలియుచున్నది. తక్కువది తీసుకొనినా 60 శాతము సూక్ష్మముండగా ముస్లీమ్ మేధావులందరూ దేవుని విషయమును మొత్తము స్థూలముగా చూస్తున్నారు. అందువలన వారికి ఎంత మేధాశక్తియున్నా దేవుని జ్ఞానము అర్థము కాదని చెప్పుచున్నాము.

ఖుర్ఆన్ గ్రంథములో **"ఆలీ ఇమ్రాన్" అను మూడవ (3) సూరాలో ఏడవ (7) ఆయత్‌నందు** స్థూల, సూక్ష్మములను గురించి చెప్పియుండగా, ముస్లీమ్ పెద్దలు సూక్ష్మముగా చూడకూడదని వ్రాసుకొన్నారు. అక్కడి వాక్యములో **"సూక్ష్మముగా చూచుట మూర్ఖులకు తెలియదు. అందువలన వారు చెప్పిన మాటలను నమ్మవద్దండి"** అని చెప్పియుండగా సూక్ష్మముగా చూచు ఎవరి మాటలనూ నమ్మవద్దండని ముస్లీమ్‌లు అర్థము చేసుకోవడము వలన, అందరూ సూక్ష్మముగా చూడడమే వదలివేశారు. అక్కడి వాక్యమును అర్థము చేసుకోకపోవడము వలన, దైవగ్రంథములోని సూక్ష్మ అర్థముతో కూడుకొన్న చాలా వాక్యములు ముస్లీమ్‌లకు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఎంత పెద్ద మేధావియైనా గంటెను త్రిప్పేసి కుండలోని కూరను తీయగలడా? అలాగే సూక్ష్మమైన విషయమును స్థూలముగా తెలియగలడా? పాటుత్రిప్పిన గంటెతో కుండలోని కూరను తీయలేనట్లే, స్థూల భావముతో దైవగ్రంథములోని జ్ఞానమును గ్రహించలేము. అందువలననే మేము ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ గ్రంథములోని రహస్య విషయములు తెలియలేదని చెప్పాము. అయినా గ్రంథమును చదివిన ఏ ముస్లీమ్‌గానీ నాకు ఇందులోని జ్ఞానము తెలియలేదు అని అనుకోవడము లేదు. చదివిన ప్రతివాడూ నాకు గ్రంథమునుండి జ్ఞానము బాగా అర్థమయి నదని అనుకోవడము జరుగుచున్నది. అలా అనుకోవడము వలన వారికి తెలిసిన జ్ఞానమునే ఇతర ముస్లీమ్‌లకు చెప్పడము జరుగుచున్నది. అలా చెప్పడము వలన గ్రంథమునుండి మొదటివానికి ఏమి అర్థమయినదో, అదే విన్నవానికి కూడా అర్థము అయినదని చెప్పవచ్చును. ఈ విధముగా అందరిలోనూ స్థూల భావములు రావడము వలన సూక్ష్మమైన దేవుడు, దేవుని జ్ఞానము అర్థము కాకుండా పోయినవి.

ఖుర్ఆన్ గ్రంథములో 6236 ఆయత్‌లలో అతి ముఖ్యమైనవి 236 నుండి 300 వరకు ఉండవచ్చును. అయితే ముహమ్మద్ ప్రవక్తగారు స్వయముగా వ్రాయించిన ముఖ్యమైన వాక్యములు పూర్తి సూక్ష్మభావముతో కూడుకొనియున్నవి. అటువంటి సూక్ష్మభావ వాక్యములను సూక్ష్మముగానే అర్థము చేసుకోకపోవడము వలన స్థూలముగా చూచుట వలన ముఖ్యముగా ఖుర్ఆన్‌లోని సారాంశమే తెలియకుండా పోయినదని చెప్పవచ్చును. అలా పూర్తి ప్రక్క భావములో అర్థమయిన జ్ఞానముతో ముఖ్యమైన మతపెద్దలే వుండగా, వారిని అనుసరిస్తూ, వారి మాటలనే వినువారందరికీ తప్పు భావమున్న జ్ఞానమే అర్థమగుచున్నది. అలా తప్పు భావముతో దైవజ్ఞానము అర్థము చేసుకొన్నవారు ఏమీ తెలియని ముస్లీమ్‌లకు **"నరకము"** అను భయమును చూపి, వారిమాటను వినునట్లు చేసుకొన్నారు. హదీసు గ్రంథములోని నియమములను మిగతా ముస్లీమ్‌ల మీద దిద్ది, వాటి ప్రకారము నడుచునట్లు చేయుచున్నారు. దైవజ్ఞానమును ప్రక్కనపెట్టి హదీసు వాక్యములనే దైవజ్ఞానముతో సమానముగా భావించుకొన్నారు. భయము, భక్తి అను రెండు విధానములలో ముందు భక్తి తర్వాత భయముండాలి. అట్లుకాకుండా ముందు భయము తర్వాత భక్తియుండకూడదు. ప్రస్తుత కాలములో ముస్లీమ్‌లయందు ముందు భయము తర్వాత భక్తియున్నది.

మనిషిని భయపెట్టి వానిద్వారా ఏ పనినయినా చేయించుకోవచ్చును. భయము అనునది ఎంతటికయినా దారితీస్తుంది. భయముతో మనిషి ఏ పనియైనా చేయగలడు. ముందు భయమువుండి తర్వాత భక్తియుంటే అది సరైన మార్గము కాదన్నాము కదా! అందువలన ముందు భక్తియుండి తర్వాత భయముండాలి. దేవుని విషయములో భక్తి, భయము

ఉండాలి. అయితే ముస్లీమ్‌లలో ముందు భయము తర్వాత భక్తియున్నది. అలా ఉండడము ప్రపంచ సంబంధమగును. ఒకన్ని చూచి మరొకడు భయపడితే, భయపడినవానికి భయపెట్టిన వానిమీద భక్తి ఏర్పడుతుంది. అది విధిలేని బలవంతపు భక్తియగును. అయితే దేవుని విధానములో అటువంటి నిర్బంధ భక్తియుండకూడదు. స్వచ్ఛంద భక్తియున్నప్పుడు తర్వాత తాను సక్రమముగా లేనేమోనను భయముతో ఎటువంటి తప్పులు చేయకుండా నడుచుకోగలడు. అందువలన భక్తితో ప్రార్థనామందిరమునకు పోయినప్పుడు మనిషి దేవునికి నమస్కారము చెప్పుచున్నాడు. దానినే స్వచ్ఛందభక్తి అని అంటున్నాము. అట్లుకాకుండా భయముతో ప్రార్థనా మందిరములకు పోయి దేవున్ని నమస్కరించడము నిర్బంధ భక్తి అంటాము. ప్రస్తుతకాలములో ముస్లీమ్‌లయందు భయముతో కూడుకొన్న భక్తియున్నది గానీ, భక్తితోకూడుకొన్న భయములేదు. ఉదాహరణకు అరబ్బీ భాషలోని ఖుర్‌ఆన్‌ను చదువుచున్న ఒక ముస్లీమ్‌ను చూచినప్పుడు మేము అతనితో మాట్లాడడము జరిగినది. యుక్తవయస్సులోయున్న ఆ ముస్లీమ్ యువకునితో కొంతసేపు మాట్లాడిన తర్వాత అతనిలోనిది భక్తికాదు భయము అని తెలిసినది. మా సంభాషణను క్రింద చూడవచ్చును.

**నేను :-** నేను నిన్ను చాలారోజులనుండి చూస్తున్నాను. నీవు శ్రద్ధగా గ్రంథమును చదువుచున్నట్లున్నది. అంత శ్రద్ధగా ఏ గ్రంథమును చదువు చున్నావు?

**అతను :-** నేను అంతిమదైవగ్రంథమయిన ఖుర్‌ఆన్ గ్రంథమును చదువు చున్నాను.

**నేను :-** ఆ గ్రంథమును నేను చూడవచ్చునా?

**అతను :-** ఈ గ్రంథమును చూస్తే నీకు అర్థము కాదు. నేను చదివే గ్రంథము అరబ్బీ భాషలోయున్నది. తెలుగుభాష అయితే నీకు అర్థమవుతుంది.

**నేను :-** సరే నీకు అర్థమయిన దానినే నాకు కొంత చెప్పు, నేను అర్థము చేసుకోగలను.

**అతను :-** నాకు అర్థమయివుంటే కదా! నీకు నేను చెప్పేది. అరబ్బీ భాషలోని అక్షరములు మాత్రము తెలుసు. అరబ్బీ భాష నాకు రాదు. అందువలన ఆ భాషలో ఏమి వ్రాశారో నాకు ఏమీ తెలియదు.

**నేను :-** భాష తెలియనప్పుడు, భావము అర్థముకానప్పుడు, ఆ గ్రంథమును ఎందుకు చదవాలి? తెలుగుభాషలోయున్న గ్రంథమును తెలుగులో చదువుకొని అర్థము చేసుకోవచ్చును కదా! అప్పుడు ఖుర్‌ఆన్‌లో ఏమున్నదో సులభముగా తెలియును కదా!

**అతను :-** నీవు చెప్పినది వాస్తవమే అయినా, నేను ముస్లీమ్‌ను కాబట్టి మా మతాచారము ప్రకారము ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీభాషలోనే చదవాలి. అర్థముకాకున్నా ఫరవాలేదు. మొదట అరబ్బీభాషలో వ్రాయబడిన గ్రంథమయిన దానివలన, దానిని అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమము మా మతములో గలదు. అందువలన మా మతపెద్దలు చెప్పినట్లు అరబ్బీ భాషలోయున్న ఖుర్‌ఆన్ గ్రంథమును చదువుచున్నాను.

**నేను :- "అర్థముకాని చదువు వ్యర్థము"** అన్నట్లు, అరబ్బీభాషలోని ఖుర్‌ఆన్ అర్థముకానప్పుడు అది వ్యర్థమే అగును కదా! చదివి ప్రయోజనముండదు

కదా! అలాంటప్పుడు తెలుగు భాషలోయున్న ఖుర్‌ఆన్ గ్రంథమును చదువు కోవచ్చును కదా!

**అతను :–** అరబ్బీ భాష దైవ భాషయనీ, దేవుని గ్రంథమయిన ఖుర్‌ఆన్‌ను అరబ్బీభాషలోనే చదువాలనీ, ఇతర భాషలలో చదువకూడదనీ, మా పెద్దలు చెప్పుట వలన మేము అలా చదువవలసి వచ్చినది. తెలుగు భాషలో చదివితే ఖుర్‌ఆన్ గ్రంథమును చదివినట్లు దేవుని లెక్కలో గుర్తింపబడదని మా మతపెద్దలు చెప్పుచుందురు. అందువలన మేము అనగా ముస్లీమ్ లందరూ విధిగా అరబ్బీభాషలోనే చదువుచుందుము.

**నేను :–** దేవుని జ్ఞానము అర్థమయ్యేదానికి ఖుర్‌ఆన్ గ్రంథమును చదువాలి గానీ, దేవుని లెక్కలో గుర్తింపబడేదానికీ, లెక్కించబడేదానికీ అని చదువ కూడదు. ఖుర్‌ఆన్ గ్రంథములో దేవుని జ్ఞానమున్నది కావున, దానిని తెలుసుకొనే దానికి గ్రంథమును చదువాలిగానీ, ఎవరిమెప్పుకొరకో చదువ కూడదు. అట్లే ఇతరులకు భయపడి వారు చెప్పినట్లు చదువకూడదు. నేను తెలుగులోనున్న ఖుర్‌ఆన్‌ను చదివాను. అది దేవుని గ్రంథమని నాకు అర్థమయినది. నీమాదిరి ఖుర్‌ఆన్‌ను అరబ్బీ భాషలోనే చదువాలని నేను చదివియుంటే అది దేవుని గ్రంథమని కూడా నాకు తెలిసేది కాదుకదా! దేవుని జ్ఞానము తెలుసుకొనుటకు ఖుర్‌ఆన్ గ్రంథమును మానవులకు దేవుడు ఇచ్చాడు తప్ప, ఫలానాభాషలోనే చదువమని చెప్పలేదు కదా! నాకు తెలిసిన వరకు **"ఇబ్రాహీమ్" అను పదునాల్గవ (14) సూరాలో నాల్గవ (4) ఆయత్‌నందు** ఇలా కలదు చూడు. **"మేము ఏ ప్రవక్తను పంపినా, అతడు దైవ విషయాన్ని స్పష్టంగా విడమరచి చెప్పటానికి వీలుగా తన జాతివారి భాషలో మాట్లాడే వానినే పంపాము. ఆపైన అల్లాహ్ (దేవుడు)**

**తాను కోరిన వారిని అపమార్గము పట్టిస్తాడు. అట్లే తానుకోరిన వారికి సన్మార్గమును చూపిస్తాడు. ఆయన సర్వాధిక్యుడు, వివేకవంతుడు"** ఈ వాక్యములో దైవజ్ఞానమునకు విలువనిచ్చి చెప్పాడుగానీ, భాషకు విలువను ఇవ్వలేదు. దైవజ్ఞానము అర్థమయ్యేదానికి వానికి వచ్చిన భాషలో బోధించే బోధకున్ని పంపుతాను అన్నాడుగానీ, బోధకుడు (ప్రవక్త) చెప్పిన భాషలోనే వినమనిగానీ, చదువమనిగానీ చెప్పలేదు కదా! దేవుడు తన జ్ఞానమును వివరముగా తెలియజేయుటకు మనిషికి తెలిసిన భాషలోనే బోధించునట్లు బోధకున్ని పంపుతాను అని చెప్పినప్పుడు, తెలుగు భాషవచ్చు భక్తునికి తెలుగు భాషలోని ఖుర్‌ఆన్ గ్రంథమును ఇచ్చాడని ఎందుకు అనుకోకూడదు. **14వ సూరా, 4వ ఆయత్** ప్రకారము దేవునిమాటను వినగలిగితే, దేవుని మాటప్రకారము ఖుర్‌ఆన్ గ్రంథమును ఏ భాషలోనయినా చదువవచ్చును. అట్లుకాకుండా దేవునిమాటను ప్రక్కన బెట్టి మతపెద్దల మాటను అనుసరిస్తే ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలోనే చదువవలసియుండును. ఇప్పుడు మనిషి ఎవరిమాటను వినగలడో అతని మీదనే ఆధారపడియున్నది. దేవునిమాటను వినగలిగితే వానిని దేవుడు సన్మార్గములో పంపగలడు. దేవుని మాటను వినకుండా ఇతరుల మాటను వినువానిని దేవుడు అపమార్గములో పంపగలడు. ఆ రెండు మార్గముల విషయము జిబ్రయేల్ చెప్పిన పై వాక్యములోనే కలదు. అంతేకాక అదే వాక్యములోనే దేవుడు సర్వాధిక్యుడు, వివేకవంతుడు అని కలదు. ఆయన ఎంతో వివేకవంతుడు కాబట్టి మనిషి సులభముగా సన్మార్గములోనికి పోవుటకు మనిషికి వచ్చిన భాషలోనే బోధకున్ని పంపుతానన్నాడు. అంతేకాక దేవుడు సర్వాధికారి కావున ఆయనకంటే మించినవారు లేరు. అందువలన దేవునికంటే

మతాధిపతులు గొప్పవారు కారు. వారిమాటలను వినకుండా దేవుని మాటలను వినడము మంచిది.

**అతను :-** ఖుర్‌ఆన్‌లోనే దేవుడు ఆ విధముగా చెప్పియుంటే మా మత పెద్దలు ఎందుకు అలా చెప్పారు?

**నేను :-** నేను చెప్పినది ఖుర్‌ఆన్‌లోని వాక్యము. వారు చెప్పినది హదీసులోని వాక్యము. ఒక విధముగా చెప్పితే ఖుర్‌ఆన్ చదివేవానికి ఎప్పటికయినా జ్ఞానము తెలియగలదు. అతడు దేవుని మార్గములో పంపబడును. ఖుర్‌ఆన్‌ను వదిలి ప్రక్క గ్రంథములలోని వాక్యములను చెప్పువారు అప మార్గములో (మాయమార్గములో) పంపబడుదురు. అందువలన మతమును, మత నియమమును వదిలి, దేవున్ని దేవుని జ్ఞానమును ఆశ్రయించుటకు నీ మతగ్రంథమైన ఖుర్‌ఆన్‌ను నీకు నచ్చిన భాషలో చదివి తెలుసుకో.

**అతను :-** అలా చదివితే మా మతపెద్దలతో ఏమయినా ఇబ్బంది వస్తుందేమో?

**నేను :-** నీవు చేసేది మంచిపనేగా! అందువలన వారితో ఏ ఇబ్బందీ ఉండదు. పైగా దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. నీవు దేవుని విషయములో భయపడు. మనుషుల విషయములో భయపడవద్దు.

(ఈ విధముగా జరిగిన మా సంభాషణలో ముస్లీమ్ యువకుని యందు ముఖ్యముగా మతము యొక్క భయము కనిపించినది.) భయము ఉన్నంతవరకు మనిషికి జ్ఞానము తెలియదు. భయము పరధర్మమగును. ధైర్యము స్వధర్మమగును. పరధర్మమనగా అధర్మమైన మాయయొక్క ధర్మము. స్వధర్మమనగా నిజధర్మమైన దైవధర్మమగును. పరధర్మమును స్వధర్మమును

గురించి  మాతృ గ్రంథమైన భగవద్గీతలో కర్మయోగమను అధ్యాయమున 35వ శ్లోకములో ఈ విధముగా చెప్పారు.

*శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్।*
*స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥*

భావము :- **"పరధర్మమను అధర్మము ఆచరించుటకు అనుకూలముగా యున్నాగానీ, గుణములేనిదయిన స్వధర్మమే మేలు. పరధర్మములోని భయముకంటే స్వధర్మములోని మరణమే ఉత్తమము."** పరధర్మమయిన అధర్మము లేక మాయ ధర్మములోని భయముకంటే, స్వధర్మములో మరణమైనా మేలని భగవంతుడు చెప్పాడు. అందువలన భయమును వీడి ధైర్యముగా దేవుని విషయములో ముందుకు పోవాలని అలా ధైర్యముగా ముందుకు పోయినప్పుడు మరణము సంభవించినా అతడు దైవసన్నిధికే పోవునని పై శ్లోకములోని అంతరార్థము.

హిందువులు ఏ విధముగా భగవద్గీతలోని జ్ఞానమును తెలియకున్నారో, అదే విధముగా ముస్లీమ్‌లు కూడా చాలామంది ఖుర్‌ఆన్‌లోని జ్ఞానమును తెలియకున్నారనియే చెప్పవచ్చును. కొందరు గ్రంథములను చదివినా అందులోని నిజజ్ఞానమును తెలుసుకోలేకున్నారని చెప్పవచ్చును. కొందరు ముస్లీమ్‌లు ఖుర్‌ఆన్ గ్రంథమును చదివియున్నప్పటికీ అందులోని జ్ఞానమునూ, హదీసు గ్రంథములలోని జ్ఞానమునూ రెండింటినీ కలుపుకొని రెండింటినీ సమానముగా చెప్పుకొనుచున్నారు. కొందరయితే ఏది ఖుర్‌ఆన్ గ్రంథములోదో, ఏది హదీసు గ్రంథములోదో కూడా తెలియక రెండిటికీ దేవుని జ్ఞానమని పేరుపెట్టుచున్నారు. పవిత్రయుద్ధమను పేరు ఖుర్‌ఆన్

గ్రంథములో లేకున్నా, దానికి **"జీహాద్"** అను పేరుతో ప్రస్తావిస్తూ, దానిని దేవుడు చెప్పినట్లు చెప్పుకొనుచుందురు. మరికొందరు ముస్లీమ్‌లు తాము హత్యలు చేసి దానిని జీహాద్‌గా వర్ణించుకొనుచుందురు. అటువంటివారు మిగతా ముస్లీమ్‌లకు కూడా **జీహాద్** అను మాటను చెప్పి, దానిని పవిత్ర యుద్ధముగా అభివర్ణించడము వలన, ఏమీ తెలియని ముస్లీమ్‌లు కొందరు మనుషులను చంపేదే పనిగా పెట్టుకొని అదే నిజమైన దేవునిమార్గముగా తలచుచున్నారు. దానినే జీహాద్‌గా పవిత్రయుద్ధముగా వర్ణించి చెప్పు చున్నారు. ఒకమారు దాదాపు పది సంవత్సరముల క్రితము నేను ఢిల్లీనుండి హైదరాబాద్‌కు రైలు ప్రయాణము చేయునప్పుడు కడపకు పోవాలని నేను ఎక్కిన ఎ.పి ఎక్స్‌ప్రెస్‌లోనే ముస్లీమ్ యువకుడు ఎక్కాడు. ఇద్దరమూ ఒకే ఫస్ట్‌క్లాస్ బోగీలో ప్రయాణిస్తూ ఎదురెదురు సీట్లలో కూర్చోవడము జరిగినది. అతను ఢిల్లీ రైల్వేస్టేషన్‌లోనే పరిచయమయ్యాడు. అతను కడప నివాసి అయినందున, నేను కడపజిల్లా యర్రగుంట్లలో హైస్కూలు చదువు చదివినందున, జిల్లా పరిచయముతో ఆ యువకుడు దగ్గరగా పరిచయము కావడము జరిగినది. ఆ దినము ఉగాది పండుగ దినమయి నందున, ప్యాసింజర్లు తక్కువగాయున్నందున, మేము కూర్చున్నచోట మేము తప్ప ఇతరులెవరూ లేరు. అప్పుడు ఇద్దరము ఏ దాపరికమూ లేకుండా మనసు విప్పి (తెరచిన హృదయముతో) మాట్లాడడము వలన నా వ్యక్తిగత విషయములు అతనికీ, అతని వ్యక్తిగత విషయములు నాకూ ఒకరికొకరు చెప్పుకోవడము జరిగినది. అట్లు మాట్లాడునప్పుడు మాటల సందర్భములో అతను కడపనుండి పోయి కాశ్మీరులో ఒక తీవ్రవాద సంస్థలో పనిచేయు నట్లు చెప్పడము జరిగినది. తాను కడప వదిలిపోయి రెండు సంవత్సరములు

అయినదనీ, అప్పటినుండి ఇప్పుడు తన అమ్మగారిని చూచుటకు వస్తున్నాననీ, వారము రోజులుండి తిరిగి కాశ్మీరుకు పోతాననీ చెప్పడము జరిగినది. అలా అతను అన్ని విషయములు నాతో చెప్పుటకు ఒక కారణము కలదు. నేను ఢిల్లీ ప్లాట్‌ఫారమ్ మీద కూర్చొని "ముస్లీమ్ జీవన విధానము" అను గ్రంథమును చదవడము అతను చూశాడు. అతను నా దగ్గరకు వచ్చి గ్రంథమును చూస్తూ మీరు ముస్లీమా? అని అడిగాడు. అవును! అని నాకు తెలియకుండానే జవాబు చెప్పడమైనది. నేను ఎందుకు అలా చెప్పాను అని ఒక క్షణము ఆలోచించాను. సరే అందులో పెద్ద తప్పేముందిలే అని అనుకొన్నాను. భాషా అను ఆ యువకుడు దాదాపు 25 సంవత్సరముల వయస్సున్నవాడు. నా మాటను విని నేను ముస్లీమ్‌యే నని నమ్మాడు. ఆ చనువుతో నాతో ఏదీ దాచిపెట్టుకోకుండా మాట్లాడడము మొదలుపెట్టాడు. అప్పుడు మా సంభాషణ ఇలా కొనసాగింది.

**భాషా :-** మీరు చదువుచున్న పుస్తకమును నాకిస్తారా, నేను డబ్బులిస్తాను.

**నేను :-** పది పేజీలు చదివితే అయిపోతుంది. పదినిమిషములలో ఇస్తాను, అయితే పుస్తకమును మాత్రము అమ్మను. దైవసంబంధమైన దానిని ఉచితముగా ఇవ్వవచ్చునుగానీ డబ్బులకు అమ్మకూడదు. నేను హైదరాబాద్‌లో ఇంకొక పుస్తకమును తీసుకొంటాను. దీనిని నీవు తీసుకో. చదివేవాళ్ళే కావాలి.

**భాషా :-** మీరు ఖుర్ఆన్ చదివారా?

**నేను :-** చదివివాను. అది అంతిమదైవగ్రంథము. దానిని చదివితే ఎంతో గొప్ప జ్ఞానము తెలియగలదు.

**భాషా :-** నాకు ఖుర్ఆన్ గ్రంథమును చదవాలనియుంది కానీ ఇంతవరకూ చదువలేదు. ఖుర్ఆన్ గ్రంథమును చదువనందుకు బాధపడుచున్నాను.

**నేను :-** ఇంత ఆసక్తియున్న వానివి ఇంతకాలము ఎందుకు చదువలేదు? దేవుని విషయములో అలసత్వము మంచిదికాదు.

**భాషా :-** అది వాస్తవమే, ఒక విధముగా దేవుని పనిలోనేయున్నాను. ఆ పనిలో చదివేదానికి అవకాశముండదు. ఖుర్ఆన్‌ను చదువలేదు అను బాధ ఒకవైపువున్నా, మరొకవైపు నేను దేవుని పనిలోయున్నాను అనే తృప్తి యున్నది.

**నేను :-** ప్రపంచపు పనులు ఏవీ దేవుని పనితోగానీ, దేవుని జ్ఞానముతోగానీ సమానము కావు. నీవు కాశ్మీరులో వ్యాపారము చేయుచున్నానని చెప్పావు. వ్యాపారము చేస్తే అది దేవుని పని ఎలా అవుతుంది? దానిలో తృప్తి ఎలా ఉంటుంది?

**భాషా :-** నీవు నాకు స్వంత అన్నలాంటివానివి. నీతో నేను అబద్ధము చెప్పకూడదు. నేను కాశ్మీరులో వ్యాపారము చేయలేదు. అల్లా కొరకు పని చేయుచున్నాను. దేవునిమార్గములో అందరికంటే ఎక్కువ శ్రమ పడుచున్నాను.

**నేను :-** ఖుర్ఆన్ చదువనిదే నీవు అల్లాకోసము ఏమి చేయగలవు? నీవు చేయు పని ఎలాంటిదో, దానిలో ఫలితము ఏముంటుందో ఖుర్ఆన్ గ్రంథము చెప్పగలదు. ఒక ముస్లీమ్‌గాయుండి ఖుర్ఆన్ చదువకుండా దేవుని కొరకు పనిచేస్తున్నానని చెప్పడము మంచిదికాదు. ఎందుకనగా! దేవుని పనిలాగానే సైతాన్ పనులుంటాయి. అంతకూ నీవు దేవుని కొరకు దేవుని పనిని ఏమి చేయుచున్నావు?

**భాషా :-** జీహాద్‌ను నేను నా జీవిత వృత్తిగా తీసుకొన్నాను. నేను స్వచ్ఛమైన జీహాదీని. దేవునిమార్గములో అన్నిటికంటే ఉత్తమమైన పనియగుట వలన దానినే నేను ఎంచుకొన్నాను.

**నేను :-** జీహాద్ అనే పదము ఖుర్ఆన్ గ్రంథములో వెతికినా దొరకదు. జీహాద్ అను పదమే ఖుర్ఆన్ గ్రంథములో చెప్పనప్పుడు, దానిని నీవు దేవునిమార్గములో ఉత్తమపనిగా ఎట్లు అనుకొన్నావు. జీహాద్ అనేది ఒక వృత్తియా? జీహాద్ అనేది ఏ పనిని చెప్పుచున్నది?

**భాషా :-** అల్లామార్గములో ఆటంకములు కలుగజేయువారినీ, అల్లాను విశ్వసించనివారినీ, అల్లాస్థానములో ఇతరులను ఆరాధించువారినీ ఎదుర్కొని పోరాడి చంపడమే పవిత్రయుద్ధము లేక జీహాద్ అంటారని మీకు తెలియదా?

**నేను :-** అంతిమదైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో లేని విషయమును నేను నమ్మను. పవిత్రయుద్ధము అను పేరును విన్నాను. దానినే జీహాద్ అనడము కూడా విన్నాను. పవిత్రయుద్ధము అంటే అది పవిత్రముగానే ఉండాలి తప్ప అపవిత్రముగా ఉండకూడదు. దేవుని జ్ఞానమునకు, దేవుని మాటకు, ఖుర్ఆన్‌లోని వాక్యమునకు వ్యతిరేఖమయిన పనిని పవిత్ర యుద్ధము అని చెప్పడము తప్పగును. ఖుర్ఆన్ వాక్యమునకు, దేవుని వాక్యమునకు విరుద్ధముగాయున్నది ఎప్పటికీ పవిత్రము కాదు. అజ్ఞాను లయినవారు జ్ఞానము తెలియనంతవరకు దేవున్ని విశ్వసించరు. అటువంటి వారికి దేవుని జ్ఞానమును తెల్పి, దేవుని జ్ఞానము యొక్క రుచిని చూపి దేవుని మార్గమువైపు మరల్చాలిగానీ, చంపడము మంచిదికాదు. **దేవుని అనుమతి లేనిదే ఎవడుగానీ జ్ఞాని కాలేడు, అజ్ఞాని కాలేడు. ఒక మనిషిని అజ్ఞానిగా మార్చుటకుగానీ, జ్ఞానిగా మార్చుటకుగానీ దేవుడే అధిపతి.** ఈ

విషయమును **ఖుర్ఆన్ గ్రంథములో ఆరవ సూరాలో (6-110, 111) ఆయత్‌లలో వ్రాయబడియున్నది. అల్లా అనుకుంటే ఏమయినా చేయ గలడు.** అంతేగానీ మనము దేవుడు చెప్పని పనిని చేస్తే అది పాపపు పని అవుతుందిగానీ, ఎంతమాత్రము పవిత్రమైన పనికాదు, పవిత్రయుద్ధమూ కాదు.

ఒక మనిషిని చంపి "వాడు అజ్ఞాని, దేవుని విశ్వసించనివాడు" అని చెప్పితే వచ్చిన పాపము పుణ్యముగా మారదు. ఈ విషయమును గురించి **పవిత్ర ఖుర్ఆన్ గ్రంథములో సూరా 5-32వ ఆయత్‌లో** ఇట్లు చెప్పడమైనది. **"ఒక వ్యక్తి హత్యకు బదులుగాగానీ, లేదా భూమిలో కల్లోలము వ్యాపింపజేసినందుకు బదులుగాగానీ, కాకుండా ఎవడైనా ఒక వ్యక్తిని చంపితే అతడు సర్వమానవజాతిని చంపినట్లేయగును. ఎవడైనా ఒక మనిషి ప్రాణాన్ని కాపాడితే అతడు సర్వమానవజాతి ప్రాణాలను కాపాడినట్లే యగును ఈ విషయమును మా ప్రవక్తలు తెలియజేశారు. అయినా అక్రమాలు చేస్తూ ఇతరులను చంపువారు కలరు".** దేవుడు ఈ విషయమును తెలియజేసిన తర్వాత పవిత్రయుద్ధము అనుట పెద్దపొరపాటగును. అంతేకాక పెద్ద అజ్ఞానమగును.

**భాషా :-** మా పెద్దలు మీరు చెప్పినట్లు చెప్పలేదు. అజ్ఞానులను, విగ్రహారాధకులను చంపడమే పవిత్రయుద్ధమనీ, అదే నిజమైన దేవుని కార్యమనీ, దేవుని కార్యములో చనిపోయినా స్వర్గమునకు పోవచ్చుననీ చెప్పారు. అది సత్యము కాదంటారా?

**నేను :-** పవిత్రయుద్ధమనే పేరే (జీహాద్ అనే పేరే) దైవగ్రంథమయిన ఖుర్ఆన్‌లో లేదు. అది మనుషులు పెట్టిన పేరేగానీ, దేవుడు చెప్పిన పేరు

కాదు. ఒక విధముగా పవిత్రయుద్ధము అంటే దేవునిమార్గములో పోరాటము అని చెప్పవచ్చును. దేవుని మార్గములో పోరాటము అంటే స్థూలముగా బయట సంబంధయుద్ధము కాదు. శరీరములోనే సూక్ష్మముగా కనిపించక యున్న గుణములతో పోరాటమని తెలియవలెను.

**భాషా :-** నేను ఇంతవరకు గొప్పగా అనుకొన్నది ఖుర్ఆన్ గ్రంథములో లేదు అని మొట్టమొదట ఇప్పుడే వింటున్నాను. దేవుడు చెప్పకనే, ఖుర్ఆన్ గ్రంథములో లేకపోయినా ఎందుకు నన్ను, నాలాంటివారిని కొందరినీ చేరదీసి అన్నిటికంటే జీహాద్‌యే దేవునికి దగ్గర దారియని చెప్పారు? ఇతరులను మా ద్వారా ఎందుకు చంపాలనుకొన్నారు? మత పెద్దలలో ఇంత అన్యాయముందా?

**నేను :-** ఒక ముస్లీమ్ మతములోనే కాదు, అన్ని మతములలో ఇదే విధానమున్నది. ముస్లీమ్ మతములో జీహాద్ (పవిత్ర యుద్ధము) అని పేరుపెట్టి అజ్ఞానముగా ప్రవర్తించుచున్నారు. మిగతా మతములలో ప్రత్యేకించి పేరు పెట్టుకోకుండా ముస్లీమ్‌లు చేసినట్లే వారు కూడా చేయుచున్నారు. మిగతా మతములవారు కూడా అక్రమ కార్యములయిన ఇతరులను హింసించడము లేక చంపడము చేయుచునే యున్నారు. ఇది అన్ని మతములలో వ్యాపించియున్నదని చెప్పుటకు అనుమానమే లేదు. అలా అన్ని మతములవారు ఎందుకు చేయుచున్నారనగా! ప్రతి మతము లోనూ ఒకటి మతవ్యాప్తి, రెండు మతరక్షణ అను రెండు కార్యములు తప్పనిసరిగా పెట్టుకొన్నారు. ఒక్క హిందూ మతములో మతవ్యాప్తి లేదుగానీ ఈ మధ్యకాలములో మతరక్షణ ఎక్కువగా యున్నదని చెప్పకతప్పదు. హిందూమతములో మతవ్యాప్తికొరకు సంఘములు ఏర్పడలేదుగానీ,

మతరక్షణ కొరకు కొన్ని పేర్లతో సంఘములు ఏర్పడినవి. స్వయంసేవక్ యనీ, విశ్వహిందూ పరిషత్‌యనీ, భజరంగదళ్‌యనీ కొన్ని పేర్లతో కొన్ని సంఘములు ఏర్పడిన విషయము అందరికీ తెలుసు. ముస్లీమ్‌లు మత వ్యాప్తికొరకు సంఘములను ఏర్పరచుకొన్నారు. అనేక పేర్లతో అనేక సంఘములు ఏర్పడినవి. మతవ్యాప్తికొరకు ముస్లీమ్‌లలో యూనివర్సల్ ఇస్లామిక్ రీసర్చ్ సెంటర్, సత్యము తెలిసింది, ఇస్లామిక్ రీసర్చ్ ఫర్ హ్యూమానిటి, ధర్మపరిచయ్ కమిటీ మొదలగు ఆధ్యాత్మిక సంఘముల పేర్లతో కొన్ని సంఘములు ఏర్పడగా, మతరక్షణ కొరకు అల్‌ఖైదా, ఇసిస్, ముజాహిద్దీన్, లష్కరే తోయిబా మొదలగు ఎన్నో ఉగ్రవాద సంస్థలు ఏర్పడినాయి. వారి మతమునకు వ్యతిరేఖముగాయున్న వారినుండి మతమును కాపాడుకొనుటకు ఉగ్రవాద సంస్థలు వారిని చంపుటకు పూనుకొన్నాయి. అటువంటి ఉగ్రవాద సంస్థలలో పనిచేయువారిని ఆకర్షించుకొనుటకు నీకు బోధించినట్లే బోధించి, ఇతర మతస్థులను చంపుటకు ప్రోత్సహించుచున్నారు. (తరువాత హైదరాబాదు రావడము వలన మా సంభాషణ అంతటితో ఆగిపోయింది.)

ముస్లీమ్ మతములో మతవ్యాప్తి కొరకు కొన్ని సంఘములు తయారై కేవలము దైవజ్ఞానమును బోధించుటకే మేమున్నదని చెప్పుచూ చివరికి మతమును ప్రచారము చేయడమే ధ్యేయముగా పెట్టుకొన్నారు. మొదట దేవుని విషయమును బోధించి తర్వాత చివరిలో తమ మతముకంటే మించినది ఏ మతమూ లేదనీ, తమ మతములోని వారినే దేవుడు దయతలుస్తాడనీ, అందువలన అందరూ తమ మతములో చేరి దేవునికి దగ్గరవారు కమ్మని చెప్పుచుందురు. ముస్లీమ్ మతములో ఒకప్రక్క మత

ప్రచారము, మరొక ప్రక్క మతరక్షణ రెండూ చేయువారుండగా, క్రైస్తవ మతములో కేవలము మత ప్రచారమునే ఎక్కువగా చేయుచున్నారు. మతరక్షణ కార్యములు ఎక్కడా కనిపించడము లేదు. క్రైస్తవులలో ఎన్నో ఆధ్యాత్మిక సంఘములు ఏర్పడి అదేపనిగా మతప్రచారమును చేయుచున్నవి. ఈ విధముగా క్రైస్తవులు మతప్రచారమను ఒకే విధానమును అనుసరించు చుండగా, హిందువులు కూడా మతరక్షణ అను ఒకే విధానమును అనుసరించుచున్నారు. మతరక్షణ ముస్లీమ్‌లలో ఉండగా, దానిలో కొన్ని ఉగ్రవాద సంస్థలు తయారై, పవిత్ర యుద్ధము అని పేరుపెట్టి ముస్లీమ్ మతమునకు విరుద్ధముగాయున్నవారిని చంపేదే ముఖ్యమైన పనిగా పెట్టుకొన్నారు. హిందువులలో వారి మతమును రక్షించుకొను కార్యములో ముస్లీమ్‌లవలె ప్రవర్తించుచున్నారు. హిందువులకు ఉగ్రవాదులను పేరులేదు గానీ, ఇంచుమించు అలాగే చేయుచున్నారు. ముస్లీమ్‌లు ఇతర మతముల వారిని కనిపెట్టి, వారిని మాత్రము చంపుట వలన చివరికి తమ మతము బలమైనదగునని వారి నమ్మకము. అందువలన ముస్లీమ్‌లు హిందువుల మీద, క్రైస్తవుల మీద దాడిచేసి చంపుచుండుట ప్రపంచవ్యాప్తముగా జరుగుచున్నది. అయితే హిందువులు కూడా తమ మతవ్యాప్తిని చేయ లేదు గానీ, మతరక్షణ విషయములో కొన్ని సంఘములుగావుంటూ, పర మతమును ప్రచారము చేయువారిని ప్రచారము చేయకుండా అడ్డు కోవాలన్నదే ముఖ్య ఉద్దేశ్యముగా పెట్టుకొన్నారు. పరమత ప్రచారమును నిరోధించడములో కొన్నిచోట్ల ఘర్షణ పడవలసివస్తున్నది. కొన్ని చోట్ల చంపుకోవలసి కూడా వస్తున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) | ముస్లీమ్‌లు | - | మతప్రచారము | - | మతరక్షణ |
| 2) | క్రైస్తవులు | - | మతప్రచారము | - | --- |
| 3) | హిందువులు | - | --- | - | మతరక్షణ |

పై విధముగా మూడు మతములవారున్నారని తెలియుచున్నది. అయితే ఇక్కడ గమనించదగిన విషయమొకటున్నది. అదేమనగా! ఆదినుండి ఉన్నది ఇందూ సమాజమే అయినా కలియుగములో రెండువేల (2000) సంవత్సరముల క్రిందట క్రైస్తవమతము పుట్టినప్పుడు అంతవరకు ఇందూ సమాజముగాయున్న ఇందువులు అప్పటినుండి ఇందూమతముగా పిలువ బడినారు. తర్వాత ఇప్పటికి పదునాలుగువందల (1400) సంవత్సరముల క్రిందట ముస్లీమ్ మతము పుట్టినప్పుడు ఇందూమతము కాస్తా హిందూ మతముగా మార్పుచెంది అప్పటినుండి హిందూమతముగా పిలువబడు చున్నది. ('హిందూ' అను పదమును గురించి ఒక స్వామీజీ అభిప్రాయము)

## "హిందూ" పదం పై

**శ్రీ పుష్పగిరి మహాసంస్థాన్ పీఠాధిపతి శ్రీ విద్యా నృసింహభారతీ స్వామి వారి అభిప్రాయము (భక్తి టీవి ఛానల్‌లో "భక్తి ధార్మిక సమ్మేళనం" కార్యక్రమం సందర్భంగా)**

(ఈ భారతదేశంలోని సంస్కృతి, భారతీయ సంస్కృతి. ఈ హిందూ అనేటటువంటి పేరు, ఎక్కడినుండి వచ్చింది, ఎలా వచ్చిందీ అంటే తురుష్కులు మన దేశాన్ని పరిపాలించే సమయంలో వాళ్ళు మనకిచ్చినటు వంటి బిరుదు "హిందువని". old persian dictionary అనే దానిలో "హింద్" అనేటటువంటి శబ్దాన్ని వివరణ ఇస్తూ "హింద్" అంటే

**"బేవకూఫ్", "చోర్". ఇది మనయొక్క ఘనత. మనకు వాళ్ళు పెట్టినటు వంటి ముద్దుపేరు "హింద్" అని పేరు. చాలా ముద్దుగా పెట్టారు వారు. మనం ఆనందంగా స్వీకరించాం. దాన్నే మనం, నిరంతరం మనల్ని మనం చెప్పుకుంటా ఉన్నాం. ఎక్కడ applications పెట్టాల్సివచ్చిన what is your religion అని అంటే హింద్, హిందు, నేను ఇండియన్‌ను, హిందువును అని చెప్పు కుంటున్నాం. కానీ మనం హిందువులం కాదు, మనం భారతీయులం.)**

అన్నిటికంటే ముందు పుట్టినది హిందూమతమే అయినా, హిందూ మతము తర్వాత పుట్టిన క్రైస్తవ, ముస్లీమ్ మతములు హిందూ మతముకంటే ఎక్కువ క్రమశిక్షణ కల్గియున్నాయి. క్రమశిక్షణలో అన్నిటికంటే ముందున్నది ముస్లీమ్ మతము. తర్వాత రెండవ స్థానములోయున్నది క్రైస్తవమతము. ఇకపోతే అన్నిటికంటే ముందు పుట్టిన హిందూమతములో క్రమశిక్షణ ఏమాత్రమూ లేకుండాపోయినది. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగములలో ఎంతో క్రమశిక్షణతోయున్న ఇందూసమాజము కలియుగము మొదటిలో 3000 సంవత్సరముల తర్వాత హిందూమతముగా మారిపోయి అప్పటినుండి ఏమాత్రము క్రమశిక్షణ లేని మతముగా తయారయినది.

పూర్వము కృతయుగమునుండి ద్వాపరయుగము వరకు ఇందూ సమాజము ఎంతో క్రమశిక్షణతో ఉండేదని చెప్పుకొన్నాము కదా! అలా ఉండుటకు కారణము ఏమనగా! ఆ కాలములో గురువు అను ఒక వ్యక్తి ఆధీనములో ఇందూసమాజమంతయూ ఉండి గురువు యొక్క ఆదేశాను సారము అందరూ నడుచుకొనేవారు. గురు ఆజ్ఞను జవదాటేవారు కారు.

అందువలన అందరూ క్రమశిక్షణతో ఉండెడివారు. కృతయుగమునుండి ద్వాపయుగము చివరివరకు, భారతదేశములోని ఇందుత్వము అంటే మిగతా దేశములలోనివారు కూడా ఎంతో గౌరవముగా చూచెడివారు. ఆ కాలములో అత్యున్నతమైన ఆధ్యాత్మికము భారతదేశములోని ఇందువులలో ఉండేది. అప్పటికాలములో కొంత ప్రాంతమునకంతటికీ ఒక రాజుయుండే వాడు. అటువంటి కొన్ని ప్రాంతముల రాజులందరూ ఒక చక్రవర్తి క్రింద పాలన సాగించెడివారు. అప్పటికాలములో భారతదేశములోని ఎన్నో ప్రాంతములకు ఎందరో రాజులుండగా, భారతదేశమునకంతటికీ రాజు లందరికీ రాజయిన ఒక చక్రవర్తి ఉండెడివాడు. రాజులకు వారి హెూదాను తెలుపునట్లు, ఈయన రాజు అన్నట్లు వారికి తలమీద కిరీటములుండెడివి. ప్రతిరాజూ చిన్నదో, పెద్దదో కిరీటము ధరించి కొలువు తీరెడివారు. కిరీటము అంటే తలకు ధరించునది, ముందర భాగమున కిరీటము అలంకారముగా తయారు చేయబడి ఉంటుంది. బహుషా పౌరాణిక సినిమాలలోగానీ, డ్రామాలలోగానీ అందరూ రాజులు ధరించిన కిరీటములను చూచియే వుందురు. అయితే రాజు ఒక ప్రాంతమునకు అధిపతికాగా, చక్రవర్తి దేశమునకంతటికీ, అన్ని ప్రాంతములకూ అధిపతిగాయుంటూ, రాజు లందరికీ రాజుగాయుండును. అందువలన చక్రవర్తి కిరీటము రాజుల కిరీటముకంటే ప్రత్యేకముగా చూస్తూనే గమనించునట్లుగాయుండును. రాజుల కిరీటమునకు ముందు భాగములో మాత్రము అలంకారముండగా, చక్రవర్తి కిరీటమునకు ముందు, వెనుక రెండు భాగములలోనూ అలంకార ముండును. ముఖ్యముగా ఇతను చక్రవర్తియని తెలియునట్లు, అతను ధరించు కిరీటమునకు వెనుక భాగమున ఒక చక్రమును అమర్చి

యుండడమును గమనించవచ్చును. అటువంటి చక్రముగల కిరీటమును ఆధ్యాత్మికములో రారాజు అయిన గురువునుండి చక్రవర్తులు పొంది యుందురు.

కొందరికి ఇక్కడొక ప్రశ్నరావచ్చును. అదేమనగా! చక్రవర్తుల కిరీటము వెనుక చక్రమును ఎందుకు పెట్టుచున్నారు? చక్రముగల కిరీటమును పెట్టి చక్రవర్తి అనడములో అర్థమేమిగలదు? అని ప్రశ్నించ వచ్చును. దానికి మా జవాబు ఈ విధముగాగలదు. చక్రము గల కిరీటమును సాంప్రదాయము ప్రకారము యోగులు ధరించాలి. యోగి ఒక్కమారు ధరించినా కిరీటమునకు అర్థము పూర్తియగును. తర్వాత ఆ చక్రమును రారాజులు ధరించుట ఆనవాయితీ గలదు. ఒకమారు యోగి ధరించినపుడు యోగి తలలోయున్న ఆత్మశక్తి లేక జ్ఞానశక్తి కిరీటమునందు కొంతయినా చేరునట్లు యోగులు సంకల్పము చేయుదురు. యోగి ధరించినపుడు కిరీటము వెనుకయున్న చక్రములోనికి జ్ఞానశక్తి చేరడము జరుగుచున్నది. తర్వాత రారాజు ధరించినపుడు అతని తలలోని ఆత్మ బుద్ధియను చక్రమును త్రిప్పి సామ్రాజ్యపాలన సక్రమముగా సాగునట్లు చేయునని వారి నమ్మకము. అందరితలలో ఆత్మయుండి వారివెనుక కర్మచక్రమును త్రిప్పుచూ, మనుషులనందరినీ ఆడించుచున్నదని తెలియు నట్లు, కిరీటములో వెనుక భాగమున చక్రమును పెట్టడము జరిగినది. సాధారణ మనిషిని కూడా తలవెనుకయుండి ఆత్మ ఆడించుచున్నదను అర్థము ఇముడునట్లు కిరీటములో చక్రమును వెనుకనే ఉంచారు. అటువంటి కిరీటములోని చక్రముయందు యోగుల తలలోని ఆత్మ శక్తి ప్రవేశించి, రారాజును కూడా ఆపదలలో ఆ శక్తి కాపాడుననీ, సామ్రాజ్యమును సక్రమముగా పాలింపజేయుననీ ఆ దినములలో అందరి భావము ఉండేది.

కాలము గడచుకొలది రాజులు పోయారు, రారాజులు పోయారు, కిరీటములు పోయాయి. కిరీటమును ధరించు చక్రవర్తుల భావము పోయింది. నేటికాలములో ఎక్కడయినా పౌరాణిక సినిమాలలోనో లేక నాటకములలోనో రాజుల వేషధారణ ధరించిన వారిని చూడవచ్చును. మహాభారతమునకు సంబంధించిన చలనచిత్రములో రారాజుగా ఆనాటి దుర్యోధనుడు ఉండేవాడు. దుర్యోధనుడు ఆనాటి చక్రవర్తి కావున, ఆయన తలమీద చక్రము గల కిరీటమును చూడవచ్చును. దుర్యోధన చక్రవర్తి క్రింద సామంత రాజులుగా పనిచేయువారు చక్రములేని కిరీటమును ధరించాలి. అయితే చక్రవర్తి ధరించెడి కిరీటమునకు, రాజులు ధరించు కిరీటమునకు తేడా తెలియనివారు నాటకములలో, సినిమాలలో అందరికీ ఒకే రకమైన కిరీటమును ధరింపజేయుచున్నారు. రారాజు అయిన దుర్యోధనునికీ, దుర్యోధనుని ప్రక్కనయున్న కర్ణునికీ చక్రమున్న కిరీటమునే ధరింపజేయుచున్నారంటే కిరీటములోని చక్రము యొక్క విలువ నేటి ప్రజలకు అర్థము కాలేదని తెలియుచున్నది. ఇక్కడ చరిత్ర తెలిసినవారు నన్ను ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా!

కృష్ణుడు కనీసము ఒక రాజ్యమునకు కూడా రాజు కాదు! కృష్ణుని అన్న అయిన బలరాముడు మధుర రాజ్యమునకు రాజుగాయుండెడివాడు. కృష్ణుడు అన్న క్రింద తమ్ముడుగాయుండి ఎప్పుడూ రాజ్యపాలన విషయమును చూడలేదు. అటువంటి కృష్ణుడు తన కిరీటములో చక్రమును ధరించినట్లు నేడు కూడా ఆయన బొమ్మలలో కనిపిస్తున్నది. రాజు కాడు, రారాజు కాడు. అటువంటి కృష్ణుడు చక్రముగల కిరీటమును ధరించవచ్చునా?యని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! కృష్ణుడు సామాన్య

మనిషికాడు. **ఆయన ఆధ్యాత్మికశక్తికే కేంద్రముగా యున్న వ్యక్తి. అందువలన ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు నేను రారాజును అన్నట్లు, అందరికీ తెలియునట్లు కృష్ణుడు చక్రముగల కిరీటమును ధరించాడు. కృష్ణుడు ఆధ్యాత్మిక చక్రవర్తి అనుటలో సంశయమేలేకుండునట్లు భగవద్గీతను కూడా బోధించాడు. అందువలన అన్ని విధములా కృష్ణుడు చక్రముగల కిరీటమును ధరించడములో అర్హుడు.** ఆధ్యాత్మిక శక్తిగలవారే అలా ధరించుటకు యోగ్యులు. పూర్వము ఆధ్యాత్మిక శక్తి లేనివారు దేవతలు సహితము చక్రముగల కిరీటమును ధరించెడివారు కాదు. ఆత్మశక్తి లేని దేవతా ప్రతిమలకు కూడా పూర్వము సాధారణ కిరీటమునే ధరింపజేసెడి వారు. ఇప్పటికీ కొన్ని దేవాలయములలో దేవతలకు చక్రములేని కిరీటములే సాంప్రదాయము ప్రకారము ధరింపజేయుట గమనించవచ్చును. తిరుమల లోని వెంకటేశ్వరస్వామికి కూడా సాంప్రదాయము ప్రకారము చక్రములేని కిరీటమునే ధరింపజేయడము నేటికినీ మనము చూడవచ్చును. ఈ సాంప్రదాయమేదో పూర్వము అందరికీ తెలిసియుండేది. నేడు ఎవరికీ తెలియకుండాపోయినది. కిరీటము ఖరీదైనది కావచ్చును, కాకపోవచ్చును. కిరీటము సాంప్రదాయము ప్రకారము ఉన్నదా, లేదాయని చూడవలెను. కిరీటము ఆధ్యాత్మిక భావమునకు సంబంధించినదేగానీ ప్రపంచ సంబంధ హోదాకు సంబంధించినది కాదని తెలియవలెను.

ఒక చక్రవర్తి క్రొత్తగా పట్టాభిషిక్తుడయిన రోజు అనగా సింహాసనము ఎక్కినరోజు, రాజులకందరికీ రాజుగా, రారాజుగా బాధ్యతలను స్వీకరించిన రోజు, ఆధ్యాత్మికములో రారాజు అయిన గురువు చక్రవర్తికి తన చేతులతో కిరీటమును ధరింప చేయును. అది చక్రవర్తుల సాంప్రదాయము. గురువు

కిరీటమును ధరింపజేయనిదే ఎవడూ భూమిమీద చక్రవర్తి అగుటకు వీలులేదు. ఈ విధముగా ఆనాటి సాంప్రదాయము ఎంతో క్రమశిక్షణతో కూడుకొనియుండెడిది. భూమిమీద కిరీటమును ధరించు యోగ్యతగలవాడు గురువు మాత్రమే. కనిపించని సామ్రాజ్యమునకు అనగా ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు రారాజు గురువు మాత్రమే. దేశములో ఎందరో బోధకులున్నా దేశములోని బోధకులందరికీ గురువు మాత్రము ఒక్కడేయుండే వాడు. ఈ విధముగా ఆనాడు ఆధ్యాత్మికములో కూడా ఎంతో క్రమశిక్షణ ఉండేది.

చిన్నరాజు పాలించే ప్రాంతమును రాజ్యము అనెడివారు. అలాగే ఎన్నో రాజ్యములను పాలించే చక్రవర్తి ఆధీనములోనున్న దేశమును సామ్రాజ్యము అని అనెడివారు. సామ్రాజ్యములు రెండు రకములు గలవు. అందులో ఒకటి స్థూలముగా కనిపించే భూమిగల సామ్రాజ్యము. రెండవది కనిపించక సూక్ష్మముగాయున్న ఆధ్యాత్మిక సామ్రాజ్యము. బయట కనిపించే సామ్రాజ్యముకంటే కనిపించని ఆధ్యాత్మిక సామ్రాజ్యము చాలా శక్తివంత మయినది, గొప్పది. కావున ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు అధిపతియైన గురువే నిజమైన చక్రవర్తి అని ఆ దినములలో అందరూ భావించెడివారు. కనిపించని సామ్రాజ్యమునకు రారాజు అయినవాడు, కనిపించే సామ్రాజ్యము నకు రారాజును నియమించగలడను భావముతో, ఆనాడు దేశమునకు చక్రవర్తి అయినవాడు గురువుచేత కిరీటమును ధరింపజేసుకొనెడివాడు. చక్రవర్తి ధరించు కిరీటమును తయారు చేసి, ముందే గురువును పూజించి ఆ కిరీటమును గురువుకు ధరింపజేయుదురు. అలా ఒక్కమారు గురువు ధరించిన చక్రముగల కిరీటమును తర్వాత పట్టాభిషేక ముహూర్తమున

చక్రవర్తికి గురువు తన చేతుల ద్వారా ధరింపజేసి దీవించును. అప్పటినుండి అతను చక్రవర్తిగా చలామణి కాగలడు.

వాస్తవముగా గురువు గుర్తింపబడనివాడు. కావున ఇతనే గురువు అని ఎవరూ చెప్పుటకు వీలులేదు. వాస్తవముగా గురువును గుర్తించలేని స్థితిలోయున్న మనుషులు సాంప్రదాయము కొరకు ఆధ్యాత్మికవేత్త అయిన వ్యక్తిని గురువుగా ఎంచుకోవడము జరుగుచున్నది. కనిపించేవాడు గురువు కాకున్నా, సాంప్రదాయము కొరకు అలా దైవజ్ఞానమును బాగా తెలిసిన వ్యక్తిని, దైవశక్తియున్న వ్యక్తిని గురువుగా ఎంచుకోవడము జరుగుచున్నది. అలా ఒక గురువును గుర్తించి పెట్టుకొన్న తర్వాత అతను చెప్పినదేదయినా చక్రవర్తి సహితము వినవలసిందే, ఆచరించవలసిందే. అందువలన గురువు మాట కనిపించెడి చక్రవర్తికంటే గొప్పదని, అతని మాటే శాసనమని చెప్పవచ్చును. గురువు అంటే ఎంతో భక్తి, భయము రెండూ ఆనాడు అందరికీ ఉండేవి. ఆ కాలములో గురువులు చెప్పిన ఆధ్యాత్మికమును అనుసరించి, గురువుల మాటను అనుసరించి చక్రవర్తులు పాలన సాగించెడి వారు. ప్రతి సామ్రాజ్యములోనూ, ప్రతి చక్రవర్తి దగ్గర ఒక గురువు ఉండెడివాడు. అప్పటికాలములో గురువులేని చక్రవర్తిగానీ, గురువు లేని సామ్రాజ్యముగానీ ఉండేదికాదు. ద్వాపరయుగము వరకు అలాగే నడచిన సాంప్రదాయము కలియుగము ప్రారంభములోనే క్రమేపి మార్పు చెందుతూ వచ్చి, ఇందూ సమాజము ఇందూమతముగా మారిపోయి, చివరకు ఇందూమతము హిందూమతమను పేరుతో చలామణి అగుచున్నది. పేర్లు మార్పుచెందినట్లే సాంప్రదాయములలోనూ, క్రమశిక్షణలోనూ పూర్తి

మార్పువచ్చినది. నేడు పూర్తి క్రమశిక్షణారాహిత్యముగా హిందూమతము నిలిచిపోయినది.

ఎప్పుడయితే మతములో క్రమశిక్షణ లేకుండా పోయినదో అప్పుడే సాంప్రదాయము లేకుండా పోయినది. సాంప్రదాయముగానీ, క్రమ శిక్షణగానీ లేని హిందూమతములో ఎవరు గురువో, ఎవడు బోధకుడో తెలియకుండా పోయినది. అటువంటి స్థితిలో ఎవరంతకు వారు మేము జ్ఞానులము, ఎవరంతకు వారు మేము గురువులము అని అనుకోవడము జరుగుచున్నది. గురువు యొక్క క్రమము త్రప్పిపోయిన నేటి హిందూ మతములో ఒకవైపు అగ్రకులము వారయిన బ్రాహ్మణులు మేము గురువులము, మేము చెప్పినట్లు మిగతావారు వినవలసిందేనని చెప్పు చున్నారు. మరొకవైపు కొద్దిపాటి జ్ఞానము తెలిసినంతమాత్రమున కొందరు బోధకులుగాయుంటూ మేమే సర్వము తెలిసినవారము, మేమే గురువులము అందరూ మా మాట వినవలసిందే, మమ్ములను పూజించవలసిందే అంటున్నారు. కొద్దిగా జ్ఞానము తెలిసినవాడు కూడా తనకు తెలిసిన జ్ఞానమెంత, తాను తెలుసుకోవలసిన జ్ఞానమెంతయని ఆలోచించకుండా, తనను తాను గురువుగా ఊహించుకొంటున్నాడు. వీరంతా ఇట్లుండగా! నేడు హిందూ మతరక్షణయను పేరుతో తయారయిన సంఘములోని వారు కూడా, తామే నిజముగా మతమును రక్షించువారమనీ, తమవలనే మతము నిలబడియున్నదనీ అనుకొనుచున్నారు. కొంత జ్ఞానము తెలిసిన అగ్ర కులమువారూ, ఆధ్యాత్మిక బోధకులూ మేము గురువులమని చెప్పుకొనినా పెద్ద ఆశ్చర్యమేమీ కాదుగానీ, ఏమాత్రము జ్ఞానము తెలియనివారూ, భగవద్గీతను చదువనివారూ, చివరకు తమ మతగ్రంథము ఫలానిదని కూడా

తెలియనివారు, తాము హిందూధర్మ రక్షకులమనుకొనువారు తమను తాము జ్ఞానులుగా, గురువులుగా లెక్కించుకోవడము చూస్తే మిక్కిలి ఆశ్చర్యము వేయగలదు.

నేడు క్రమశిక్షణ లేని హిందూమతములో నిజముగా దేవుడే వచ్చి గురువుగా ఉద్భవించినా, అతనిని అవమానపరచి నీవు గురువుకాదు మేమే గురువులము అనువారు గలరు. అంతేకాక మతరక్షకులు కూడా మేము చెప్పినట్లు, మా మతమునకు అనుకూలముగా జ్ఞానము చెప్పాలిగానీ, నీ ఇష్టమొచ్చినట్లు చెప్పితే కుదరదు అని నిజగురువుకు కూడా ఆంక్షలు విధించి, మేము చెప్పినట్లే నీవు చెప్పాలి అను హిందూధర్మరక్షకులు గలరు. నేడు హిందూ ధర్మములంటే ఏమిటో తెలియనివారు, హిందూధర్మ రక్షకులమని చెప్పుకొంటున్నారు. భగవద్గీతను చదువనివారు, మతరక్షకులమని చెప్పు కొంటున్నారు. హిందుత్వములోని కనీసము ఒక్క ధర్మము కూడా తెలియని వారు, హిందుత్వ రచన గురించి మాట్లాడుచున్నారు. ముస్లీమ్‌లు తమ మతముగానివారిని జీహాద్ పేరుతో పీడించుచుండగా, హిందువులు తమ మతమేదో, పరాయిమతమేదో గుర్తించలేని స్థితిలోయుండి, తమ మతము వారిని తామే హింసించుకొనుచున్నారు. హిందువులలో ఏమాత్రము జ్ఞానములేనిదానివలన అజ్ఞాన గ్రుడ్డితనముచేత, తన మతమును పరాయి మతముగా తలచి ఒకే మతమువారయిన హిందువులు హిందువులతోనే పోట్లాడుకొనుచున్నారు. ముస్లీమ్ మతములో జీహాద్ అను పేరుతో స్వమత రక్షణకొరకు, ఇతర మతస్థులను హింసించడము లేక చంపడము జరుగు చున్నది. అలా చేయడమే వారిలో కొందరి ముఖ్య కార్యముగాయుండగా, దానినే వారు దేవునికొరకు చేయు పవిత్రయుద్ధము అంటున్నారు. అయితే

ఇక్కడ హిందువులలో పవిత్రయుద్ధము అనుపేరు లేకున్నా, ముస్లీమ్‌లు తమ మత రక్షణకు ఎలా మిగతా మతస్థులను చంపుచున్నారో, అలాగే తమ మతరక్షణకొరకు తాము కూడా ఇతర మతముల వారిని హింసించాలను కొన్నారు. మతప్రచారమే తమ ధ్యేయముగా పెట్టుకొన్న క్రైస్తవులమీద మరియు ముస్లీమ్‌ల మీద తమ దాడులుండవలెనని అనుకొన్నారు. అయితే ముస్లీమ్‌లవలె హిందువులు ప్రత్యేకమైన దాడులు ఎక్కడా చేయలేకున్నా, చేతనయినంతవరకు చేయాలనుకొన్నారు.

మిగతా రెండు మతములు క్రమశిక్షణగల మతములయిన దానివలన ఆ మతస్థులు వారి గురువుల సూచనలనుబట్టి దాడులు ఎవరి మీద చేయాలో ముందే నిర్ణయించి చేయుచుందురు. అయితే హిందూ మతములో క్రమశిక్షణారాహిత్యమువలన వారికి ఒక పెద్దగానీ, గురువు గానీ లేనందున, ఎవరిమీద దాడిచేయాలో సూచనలిచ్చువారు లేనందున, వారి దాడులు గాడితప్పినవై తమ మత నాశనమునకే ఉపయోగపడు చున్నవి. ఇక్కడ చిన్న ఉదాహరణ చెప్పుతాను చూడండి. ఈ ఉదాహరణ ప్రత్యక్షముగా జరిగినది, నేను స్వయముగా చూచినది. కర్ణాటక రాష్ట్రములో బళ్ళారి జిల్లాయందు ఒక పల్లెటూరిలో ఒక పిల్లల కోడిని చూస్తూ ఒకచోట కూర్చున్నాను. కోడి దగ్గరయున్న దాని పిల్లలు దాదాపు పది దినముల వయస్సువనుకొంటాను. తల్లికోడి ముందుపోవుచుండగా కోడిపిల్లలు దానివెంట పోవుచున్నవి. దాదాపు పదినిమిషములు ఒక కల్లములో భూమిని గెదిరి (కాళ్ళతో బరికి) బయటపడిన గింజలను ఎంతో ప్రేమతో పిల్లలకు కోడి తినిపించడమును చూచి తల్లిప్రేమ పక్షులలో కూడా ఆ విధముగా యున్నదని అనుకొన్నాను. తల్లికోడి చుట్టూ పన్నెండు పిల్లలున్నవి. తర్వాత

తల్లికోడి ముందుకురాగా, తల్లివెంటనే పిల్లలు కూడా రావడము జరిగినది. అయితే అక్కడ ఒక చిన్న మురికి కాలువయుండగా, ఆ కాలువను తల్లికోడి సులభముగా దాటివచ్చినది. అయితే పిల్లలు మాత్రము కాలువను దాటి రాలేక పోయాయి. పిల్లలన్నీ కాలువను దాటి రావాలని ప్రయత్నము చేయుచున్నవి. అక్కడున్నది చిన్న మురికి నీరుకాలువే అయినా, ఆ కాలువలో అక్కడేయున్న మెకానిక్‌షెడ్‌వాడు ఇంజన్‌నుండి తీసివేసిన వృథాగాయున్న నల్లని ఆయిల్‌ను కాలువలో పోసియుండడము వలన, కాలువ జంపునా నల్లగా ఇంజన్‌ఆయిల్ ఉన్నది.

కాలువ దాటాలని ప్రయత్నము చేయు కోడిపిల్లలలో ఒక పిల్ల కాలువను ఎగిరి ఇవతలివడ్డుకు వచ్చినది. దానివెంటనే ఎగరాలని చూచిన మరొకపిల్ల కాలువలో పడిపోయినది. కాలువలో పడినప్పుడు నల్ల ఆయిల్ దానికి తగులుకోవడము వలన, తెల్లనికోడిపిల్ల నల్లగా తయారయిపోయినది. అలా కాలువలో పడిన పిల్ల బయటికి ఎక్కివచ్చి తల్లిదగ్గరికి పోయినది. అయితే తల్లికోడి తన పిల్లను తాను గుర్తించలేక, తడిసిన శరీరముతో నల్లగాయున్న పిల్ల తనది కాదనుకొన్నది. వెంటనే తల్లికోడి తన ముక్కుతో కోడిపిల్లమీద దాడిచేసి పొడవడము వలన కోడిపిల్ల చనిపోయింది. ఇదంతయూ మన కళ్ళ ఎదుటే జరిగినా, తల్లికోడికి నల్లగా కనిపించు పిల్ల తనదేనని చెప్పలేము. దగ్గరకు వచ్చిన పిల్లను శత్రువును చూచినట్లు చూచి దానిమీద దాడిచేసింది. కోడిపిల్లకు నలుపురంగు తగులుకొనినంత మాత్రమున తన పిల్లను తానే కోడి గుర్తించలేకపోయింది. అక్కడ జరిగిన సంఘటనలో పిల్లకోడి తప్పు ఏమీలేదుగానీ, పూర్తి తల్లికోడి తప్పే కనిపించు చున్నది. కాలువలో దిగివచ్చి నంతమాత్రమున, తన పిల్లకు కొద్దిపాటి

నలుపు తగులుకొన్నంతమాత్రమున ఇది తన పిల్లా! కాదా! యను విచక్షణ కోడికి లేకపోవడము వలన అలా జరిగినది. అప్పుడు తల్లికోడి దగ్గరకు రావాలని ప్రయత్నించిన వాటిలో ఐదు పిల్లలు కాలువను ఎగిరివచ్చాయి. మిగతా ఏడు పిల్లలు కాలువను ఎగరలేక కాలువలో దిగివచ్చిన దానివలన తల్లికోడి అన్నిటినీ చంపివేసింది. మిగతా ఐదుపిల్లలతో అక్కడనుండి పోయింది.

అక్కడ జరిగిన సంఘటనలో తల్లికోడికి బుద్ధిగానీ, విచక్షణా జ్ఞానముగానీ లేనిదానివలన, తన పిల్లలను తానే గుర్తించలేక ఉన్న పన్నెండు పిల్లలలో ఏడు పిల్లలను తానే చంపివేసింది. అంతకుముందు పది నిమిషముల క్రిందట భూమిని కాళ్ళతో బరికి, మట్టిలోని గింజలను బయటికి తీసి, తనపిల్లలకు ప్రేమతో తినిపించిన తల్లికోడి, రంగుపూసుకొన్న పిల్లలు తనవి కాదని అసూయతో చంపివేయడము జరిగినది. ఇటువంటి దానితో సమానమైన సంఘటన మనుషులలో జరిగితే, తనవారిని తానే గుర్తించలేక చంపుకొంటే, అటువంటి వారిని మనుషులనుటకు కూడా మనసు ఒప్పుకోదు. అయితే హిందూమతములో మేము హిందూరక్షకులమను వారు తమ హిందువులనే పరాయివారిగా భావించి, హింసించిన సంఘటనలను స్వయముగా నేను చూశాను. నేడు ఏమాత్రము జ్ఞానము లేని హిందువులు కొందరు మతరక్షణ సంఘములోయుండుటవలన, వారు వారి మతమును రక్షించుకొనుటకు ఇతర మతములను హింసించినా అది వారిపనేలే! యని అనుకొంటాము. అట్లుకాకుండా ఇతర మతముల వారిని కాకుండా తమ మతమువారినే ఇతర మతములవారిగా లెక్కించి బాధించినపుడు వారిని ఏమనాలో మీరే చెప్పండి! నల్లనిరంగు పూసుకొని

మారువేషము వేసుకొన్నట్లు కనిపించిన తన పిల్లలను కోడి కనుక్కోలేదు, అంటే దానికి కొంత కారణము కలదనియే చెప్పవచ్చును. పూర్తి రంగు మారిపోయి మారువేషములోయున్న పిల్లలను తల్లికోడికి ప్రేమయున్నా, అవి తన పిల్లలుకావని నిర్ణయానికి వచ్చినప్పుడు అలా చేసింది. కోడికి వేషమును గురించి ఆలోచించు శక్తిలేదు అని కొంత సర్దిచెప్పవచ్చును. ఒకవేళ అట్లుకాకుండా పిల్లల రంగుమారకుండా యుండినప్పటికీ, కొన్ని పిల్లలు దానివెంట వేగముగా నడువలేక ఆలస్యముగా తనవద్దకు వస్తే, అంతమాత్రమున ఇవి నా పిల్లలు కాదనుకొని కోడి తన పిల్లలను చంపితే అంతకంటే దుర్మార్గము, అంతకంటే తెలివితక్కువ మరొకటి యుండదని చెప్పవచ్చును. తాను పరిగెత్తినట్లే తనవెంట పరుగిడలేదనో, తాను అరచి నట్లు పిల్లలు కూడా అరవలేదనో, తన పిల్లలను కోడి చంపితే దానివద్ద తన పిల్లలు రెండుమూడు రోజులకంటే ఎక్కువ కాలముండవనీ, చివరకు రెండుమూడు రోజులలో అన్నీ చనిపోవునని చెప్పవచ్చును. అలాగే హిందూ మతస్థుడు తాను తన మతమును ప్రేమిస్తూ, ఇతర మతములను ద్వేషిస్తూ యుండి, తన మతము కానివారిని చంపాలని అనుకొన్నప్పుడు, ఒకవేళ తన మతమువారు కోడిపిల్లలు రంగు పూసుకొన్నట్లు తన మతమువారు ముస్లీమ్ మతమువారివలె గడ్డము ధరించి, లుంగీధరించి కనిపించియుంటే వారి వేషధారణ చూచి తనవారుకాదని, ముస్లీమ్‌లని పొరపడినారనీ, అందువలన వారి వేషమునుబట్టి ముస్లీమ్‌లుగా నిర్ణయించుకొని వారిమీద హిందువుగాయున్నవాడు దాడి చేశాడంటే, కోడి తన పిల్లలను కనుక్కోలేక పొడిచి చంపినట్లు, ఇక్కడ జరిగిందిలేయని అనుకోవచ్చును.

అట్లుకాకుండా తల్లికోడి తన పిల్లలు తనవెంట తాను పోయినంత వేగముగా రాలేదనో, లేక తనవలె అరవలేదనో తన పిల్లలను చంపితే, అంతకంటే దుర్మార్గము లేదనీ, ఆ సంఘటన కోడి జాతికే కళంకమనీ చెప్పవచ్చును. అలాగే ఒక హిందూ మతరక్షక సంఘమువారు తాము ఆరాధించు దేవున్ని ఆరాధించలేదనో, తాము జపించు మంత్రమును జపించ లేదనో సాకుచూపి, అంతమాత్రమున తన హిందువులుగా వారిని లెక్కించ కుండా, వారిని పరాయి మతమువారని లెక్కించి వారిమీద దాడిచేస్తే, తన మాదిరి నడువలేదనీ, తనమాదిరి అరువలేదనీ తన పిల్లలమీద అనుమానము పెంచుకొని, అవి తనపిల్లలు కాదేమోనని తల్లికోడి తన పిల్లలను చంపుకొన్నట్లు, నా బొట్టు పెట్టనివాడు, నా మంత్రమును జపము చేయని వాడు, నావలె జుట్టు దువ్వనివాడు తనవాడుకాదేమో! అను అనుమానముతో తన హిందువుల మీదే దాడిచేయు హిందువులను ఏమనాలో మీరే యోచించండి. తన పిల్లలను చంపుకొన్న కోడిని చూచి ఇది కోడిజాతే కాదన్నట్లు, అటువంటివారిని మనుషులే కాదనాలి. ఇంకొక లెక్కప్రకారము వాడు హిందూరక్షణ సంఘములోయున్నా, వాడు హిందూ రక్షణ చేయలేదు గానీ, అనుమానముతోనో లేక గుర్తింపు రావాలను ఉద్దేశ్యముతోనో, వాడు హిందూ భక్షణ చేయుచున్నాడని చెప్పవచ్చును. తన వారిని తానే చంపుకొను హిందువులకంటే జీహాద్ అనో, పవిత్ర యుద్ధమనో, ఇతర మతస్థులను చంపు ముస్లీమ్‌లు మేలుకదా!యని నేను అంటున్నాను. ఎందుకంటే వాని నియమము ప్రకారము వాడు తన మతము కానివారిని చంపుచున్నాడు. హిందూరక్షణ సంఘములో కూడా ఇతర మతస్థులను పీడించాలను ఉద్దేశ్యము కల్గియుండి, తెలివితక్కువతో

తనవారినే చంపుట వలన, హింసించుట వలన, తన మతమును తాను నాశనము చేసుకొన్నట్లగుచున్నది కదా!యని అడుగుచున్నాను. ముస్లీమ్‌లది న్యాయమో! అన్యాయమో! వారు అనుకొన్నది సక్రమముగా చేయు చున్నప్పుడు, అలాగే హిందువులు అనుకొన్నది సక్రమముగా చేయలేనప్పుడు, మతరక్షణలో హిందువులకంటే ముస్లీమ్‌లే మేలుకదా!యని చెప్పక తప్పదు.

హిందూమతములో పూర్వము మనుషులందరికంటే గురువులే గొప్పయనీ, వారిని రాజులు, చక్రవర్తులు సహితము అనుసరించెడివారనీ చెప్పుకొన్నాము. నేడు హిందువులలో అజ్ఞానము పెరిగిపోయి సాధారణ మనిషి సహితము గురువులను నీవు ఇట్లేవుండవలెను, మేము చెప్పిన మంత్రమునే చెప్పవలెను, మేము పెట్టిన నామమునే పెట్టవలెననీ చెప్పుచున్నా డంటే, హిందూమతములో క్రమశిక్షణ పూర్తి లేకుండా పోయినదనీ, ఎవని ఇష్టారాజ్యముగా వాడు ప్రవర్తించుచున్నాడనీ, పెద్దాచిన్నాయనిగానీ, గురువు, దైవమనిగానీ ఏమాత్రము ఆలోచించడము లేదనీ, ఎవరంతకువారు తాము తెలిసినవారుగా ప్రవర్తించుచూ, చివరకు గురువులను కూడా గౌరవించక, నీవు మేము చెప్పినట్లు వినవలయుననీ, అట్లు వినకపోతే నీవు హిందువే కాదనీ అంటున్నారు. హిందూమతము ఈ విధముగా క్రమశిక్షణలేనిదై పోవుట వలన ఒక హద్దూ, ఆచారము లేకుండాపోయి, చివరకు సామాన్య మనుషులు హిందూమతమును వీడి ఇతర మతములలోనికి పోవడము జరుగు చున్నది. క్రమశిక్షణ లేని హిందూమతము ముందర క్రమశిక్షణగల క్రైస్తవ, ముస్లీమ్ మతములు కనిపించుచుండగా, చాలామంది హిందువులు ఆ మతములలోనికి పోవడము జరిగినది. హిందువులలో తమ గుర్తింపు కొరకు కొందరూ, రాజకీయ ప్రయోజనాలకొరకు కొందరూ, సాటి

హిందువులను ఏదో ఒక సాకుతో బాధించుచుండగా, హిందూమతము మీద ఏవగింపు వచ్చిన వారు కొందరు ఇతర మతస్థులుగా మారిపోయిన సంఘటనలు గలవు.

ముస్లీమ్‌లు పవిత్రయుద్ధమని చెప్పుచూ ఇతర మతస్థులనూ, అల్లాను విశ్వసించనివారినీ, చంపడము మంచిపనికాదని ఒకప్రక్క చెప్పుచూ, తాము కూడా అదే పనిని చేయాలనుకొన్న హిందువులు కొందరు, మతరక్షణ సంఘములను స్థాపించుకొని, చివరకు ముస్లీమ్ జీహాదీలు చేసినట్లు ఇతర మతములవారిని చంపక, తమ మతమువారిని తామే చంపుకోవడము, వారికంటే నీచమయిన పనిని చేసినట్లు కాదా! జీహాదీలు చేయుచున్న పని మంచిదో చెడ్డదో అటుంచి, వారు చేయాలనుకొన్నది చేయుచున్నారు. హిందువులు కూడా మతరక్షణ కార్యములు చేయాలనుకొని చివరకు మతభక్షణా కార్యములు చేయుచున్నారు. అటువంటప్పుడు హిందువులకంటే ముస్లీమ్‌లే మతరక్షణలో సక్రమముగాయున్నారని తెలియుచున్నది. నేడు హిందూ మతరక్షణ సంఘములు హిందుత్వము అంటే ఏమిటో, హిందూ ధర్మములు అంటే ఏమిటో తెలియని స్థితిలోయుండి, కేవలము మతము అని ముసుగు వేసుకొని గ్రుడ్డిగా ప్రవర్తించుచూ, హిందూ మతమును సర్వనాశనము చేస్తున్నారను తపనతో మేము ఈ విషయమును ఇంత ఘాటుగా చెప్పవలసివచ్చినది.

హిందూమతమునకు దిశ, నిర్దిశలు ఇవియని నిర్ణయము చేసి చూపువారు హిందుమతములోని గురువులు. రెండువేల సంవత్సరముల పూర్వము ఆదిశంకరాచార్యుడు అను గురువు హిందూమతములో పుట్టి, ఆయన హిందుత్వములో అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి, ప్రచారము

చేసి చివరకు జగద్గురు ఆదిశంకరుడు అని పేరుగాంచి 32 సంవత్సరము లకే చనిపోయాడు. ఆయన తర్వాత విశిష్టాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యులు హిందూమతములో స్థాపించి, 120 సంవత్సరములుండి హిందూమతములో వైష్ణవ గురువుగా పేరుపొందాడు. తర్వాత కొంత కాలమునకు మధ్వాచార్యులవారు వచ్చి హిందూమతములో ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేసిపోయాడు. ఇంతవరకు కలియుగములో ముగ్గురు గురువులు వచ్చిపోవడము జరిగినది. శంకరాచార్యులవారు, రామానుజాచార్యుల వారు స్థాపించినది అద్వైత సిద్ధాంతమే అయినా కొద్దిపాటి తేడా అద్వైత, విశిష్టాద్వైత అను పేరుతోయున్నాయి. మధ్వాచార్యులవారు ద్వైత సిద్ధాంతమును స్థాపించారు. అర్థము ప్రకారము వివరించి చెప్పుకొంటే అద్వైతము అంటే ఒకటియని అర్థము. అలాగే ద్వైతము అంటే రెండుయని అర్థము. విశిష్టాద్వైతము అంటే విశేషమైన ఒకటి అని అర్థము. ఒకటి మరియు విశేషమయిన ఒకటి రెండూ ఒకటే కదా! ద్వైతము అంటే రెండు అని చెప్పుకొన్నాము. అద్వైత సిద్ధాంతములో దేవున్ని ఒక్కన్నే చూపుతున్నారు. మధ్వాచార్యుల ద్వైతములో అనగా రెండులో ఒకటి దేవుడు, రెండు జీవుడు అని రెండు భాగములను చూపుచున్నారు. ఒకటి, రెండు సిద్ధాంతములు అనగా దేవుడు మరియు జీవుడు అను రెండు కలియుగములో రెండువేల సంవత్సరముల పూర్వమునుండి వచ్చాయి.

కలియుగము వచ్చి దాదాపు ఐదువేల నూట పదిహేను సంవత్సర ములయినది. కలియుగమునకంతటికీ ముగ్గురు గురువులు, రెండు సిద్ధాంతములు హిందూమతములో వచ్చాయి. అయితే నేడు భూమిమీద మూడవ సిద్ధాంతమును ప్రతిపాదించి ప్రచారము చేయు నాల్గవ గురువు

ప్రస్తుత కాలములో ప్రత్యక్షముగాయున్నాడు, ఆయనే **త్రైత సిద్ధాంత ఆదికర్త ఆచార్య ప్రబోధానందయోగీశ్వరులని చెప్పుచున్నాము.** ఈ గ్రంథ రచయిత కూడా ఆయనే. ఇప్పటివరకు కలియుగములో వచ్చిన హిందూ గురువులు ఈయనతో కలిపి నలుగురే అవుతారు. దేశములోని మిగతా గురువు లందరూ వీరి సిద్ధాంతములను అనుసరించి యుండువారేనని తెలియాలి. అర్థమగుటకు ఉదాహరణగా వివరించి చెప్పితే రాజకీయము, రాజ్యాంగము ఒకటే అయినా అందులో కాంగ్రెస్, కమ్యూనిస్టు, భారతీయ జనతా, తెలుగుదేశము అను పార్టీలున్నట్లు, నాలుగు పార్టీలకు పార్టీని స్థాపించిన వారు నలుగురుయున్నట్లు, హిందూమతములో కూడా నలుగురు గురువులు, మూడు సిద్ధాంతములు గలవు. రెండు సిద్ధాంతములను ప్రతిపాదించిన ముగ్గురు గురువులు కాలగర్భములో కలిసిపోయినా, వారు ప్రతిపాదించిన సిద్ధాంతములను తర్వాత ఎంతమంది నడిపినా, ఆచరించినా, సిద్ధాంతము లను స్థాపించిన వారిపేర్లు స్థిరస్థాయిగా నిలిచిపోవును. రెండువేల సంవత్సరముల క్రిందట చనిపోయిన ఆదిశంకరాచార్యుని నేటికినీ, ఎప్పటికీ అద్వైత సిద్ధాంతకర్తగానే చెప్పుకొంటారు. అలాగే ద్వైత సిద్ధాంతకర్తగా మధ్వాచార్యులనే చెప్పుకొంటాము. మూడవ సిద్ధాంతమైన త్రైత సిద్ధాంత కర్తగా ఆచార్య ప్రబోధానందయోగీశ్వరుల వారి పేరే స్థిరస్థాయిగా యుంటుంది.

అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతములు ఇంచుమించుగా రెండూ ఒకటే యని చెప్పవచ్చును. ఐస్‌క్రీమ్, పాలఐస్‌క్రీమ్ అని చెప్పడములో రెండూ ఐస్‌క్రీమ్‌లే అయినా ఒకటి సాధారణ నల్లది, రెండవది కొంత విశేషము కల్గిన పాలది. అంతేతప్ప రెండూ ఐస్‌క్రీమ్‌లే అన్నట్లు, రెండూ అద్వైత

సిద్ధాంతములేగానీ ఒకటి సాధారణమైనది, మరొకటి విశేషతకలది అని గ్రహించాలి. అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతకర్తలయిన ఆది శంకరాచార్యుల వారు, రామానుజాచార్యులవారు ఇద్దరూ బ్రాహ్మణులే. ఒకరిని మించిన తెలివి మరొకరికి ఉండెడిది. అయితే శంకరాచార్యుడు ఇరవై (20) గ్రంథములు వ్రాశాడు. అవి వరుసగా...

**1) గీతాభాష్యము.** **2) బ్రహ్మసూత్ర భాష్యము.**

**3) వివేక చూడామణి.** **4) ఉపదేశ సహస్రి.**

**5) అపరోక్షానుభూతి.** **6) ఆత్మబోధ.**

**7) వాక్యసుధ.** **8) తత్త్వబోధ.**

**9) వాక్యవ్రితి.** **10) పంచీ కరణము.**

**11) శివానందలహరి.** **12) సౌందర్యలహరి.**

**13) నిర్గుణ మానసపూజ** **14) కనకధార స్తోత్రము.**

**15) భజగోవిందము.** **16) భవానీ అష్టకము.**

**17) నిర్వాణ శతకము.** **18) సాధనా పంచకము.**

**19) శివ మానస పూజ.** **20) సిద్ధాంత తత్త్వవిందు.**

తరువాత వచ్చిన రామానుజాచార్యులు తొమ్మిది (9) గ్రంథములు వ్రాశాడు. అవి వరుసగా...

1) వేదాంత సంగ్రహము. 2) శ్రీభాష్యము.

3) గీతాభాష్యము. 4) వేదాంత దీపము.

5) వేదాంత సారము. 6) శరణాగతి గద్యము.

7) శ్రీరంగ గద్యము. 8) శ్రీవాలికుంట గద్యము.

9) నిత్యగ్రంథము.

ఆ తరువాత వచ్చిన మధ్వాచార్యులవారు ముప్పై ఏడు (37) గ్రంథములు వ్రాశాడు. అవి వరుసగా...

1) యమక భారత. 2) మహాభారత తాత్పర్య నిర్ణయ.

3) భాగవత తాత్పర్య నిర్ణయ 4) కృష్ణామృత మహార్ణవ.

5) కృష్ణజయంతి నిర్ణయ. 6) సదాచార స్మృతి.

7) యతి ప్రణవ కల్ప. 8) తంత్రసార సంగ్రహ.

బ్రహ్మసూత్రాలపై నాలుగు (4) రచనలు :-

1) బ్రహ్మసూత్ర భాష్యము. 2) అను భాష్యము.

3) అను వ్యాఖ్యానము. 4) న్యాయ వివరణ.

భగవద్గీతపై రెండు (2) రచనలు :-

1) గీతా భాష్యము. 2) గీతా తాత్పర్య నిర్ణయ.

ప్రకరణాలపై పది (10) రచనలు :-

1) విష్ణు తత్వ నిర్ణయ. 2) తత్వ సాంఖ్యానము.

3) తత్వోద్యోత. 4) తత్వ వివేక.

5) ప్రమాణ లక్షణ. 6) కథ లక్షణ.

7) కర్మ నిర్ణయ. 8) ఉపాధి ఖండన.

9) ప్రపంచ మిథ్యత్వ అనుమాన ఖండన. 10) మాయవద ఖండన.

ఋగ్వేదంపై ఒక (1) రచన :-

1) ఋగ్ భాష్య.

ఉపనిషత్తులపై పది (10) రచనలు :-

1) ఈశావాస్య ఉపనిషత్ భాష్యము. 2) కేనో ఉపనిషత్ భాష్యము.
3) కఠోపనిషత్ ఉపనిషత్ భాష్యము. 4) ముండక ఉపనిషత్ భాష్యము.
5) సత్ప్రష్న ఉపనిషత్ భాష్యము. 6) మండూక్య ఉపనిషత్ భాష్యము.
7) ఐతరేయ ఉపనిషత్ భాష్యము. 8) తైత్తరేయ ఉపనిషత్ భాష్యము.
9) బృహదారణ్యక ఉపనిషత్ భాష్యము. 10) చాందోగ్య ఉపనిషత్ భాష్యము.

స్తోత్రాలపై రెండు (2) రచనలు :-

1) ద్వాదశ స్తోత్రములు 2) నరసింహా నఖ స్తుతి.

ప్రస్తుత కాలములో ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు ఇప్పటికి యాభైనాలుగు (54) గ్రంథములు వ్రాశాడు. ఇంకా వ్రాయబోయే గ్రంథములు మరికొన్ని గలవు. మొత్తము చతుర్ షష్ఠీ (64) గ్రంథములను వ్రాయాలనుకొన్నాడు. ఈ విధముగా చూస్తే గతములోని ముగ్గురు జగద్గురువులకంటే మూడవ సిద్ధాంతమును తెల్పిన నాల్గవ గురువయిన ప్రబోధానందయోగీశ్వరులు రెండింతలు లేక మూడింతలు ఎక్కువ గ్రంథములను వ్రాశాడని చెప్పవచ్చును. యోగీశ్వరుల వారి రచనల గ్రంథముల పేర్లు వరుసగా ఇలాగున్నవి.

1) త్రైత సిద్ధాంత భగవద్గీత. 2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు. 4) గీతా పరిచయము.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?). 6) ధర్మము-అధర్మము.
7) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?). 8) సత్యాన్వేషి కథ.
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా. 10) ఇందుత్వమును కాపాడుదాం.

11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) మరణ రహస్యము.
13) జనన మరణ సిద్ధాంతము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తల్లి తండ్రి.
21) తిట్ల జ్ఞానము - దీవెనల అజ్ఞానము.
22) దేవాలయ రహస్యములు.
23) గీతం-గీత (పాటల జ్ఞానము).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) త్రైతారాధన.
27) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
28) సమాధి.
29) గురుప్రార్థనా మంజరి.
30) మతాతీత దేవుని మార్గము.
31) నిగూఢ తత్త్వార్థ బోధిని.
32) ప్రబోధానందం నాటికలు.
33) హేతు వాదము-ప్రతివాదము.
34) ప్రబోధ.
35) సిలువ దేవుడా?
36) సుబోధ.
37) దేవుని గుర్తు-963.
38) మతము-పథము.
39) ఇందువు క్రైస్తవుడా?
40) ఆత్మలింగార్థము.
41) నాస్తికులు-ఆస్తికులు.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) ద్రావిడ బ్రాహ్మణ.
45) తీర్పు-దేవుని తీర్పు.
46) కర్మ పత్రము.
47) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) మత మార్పిడి దైవద్రోహము.

**51) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు. 52) జీహాద్ అంటే యుద్ధమా?.**

**53) స్వర్గము ఇంద్రలోకమా!- నరకము యమరాజ్యమా!! 54) గుత్తా.**

గతములో హిందూ సిద్ధాంతకర్తలయిన ముగ్గురు జగద్గురువులు నేడు మనము చూడాలన్నా కనిపించరు. అయితే నాల్గవ గురువు త్రైత సిద్ధాంత ఆదికర్త అయిన ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు నేడు సజీవముగాయున్నాడు. ఒక సిద్ధాంతకర్త భూమిమీదయున్నప్పుడు ఆయనకు సమకాలికులుగా యున్నవారు కొంతవరకు అదృష్టవంతులేనని చెప్పవచ్చును. దాదాపు నాలుగు వందల సంవత్సరముల క్రిందటే పోతులూరి వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో ప్రబోధానంద యోగీశ్వరుల పేరునూ, ప్రబోధాశ్రమము పేరునూ వ్రాసుకొన్నాడు. అంతే కాక **"సిద్ధాంత శిరోమణి"** అని యోగీశ్వరులను చెప్పుచూ యోగీశ్వరులే నాకూ గురువు, మీకూ గురువు అని చెప్పడము కూడా జరిగినది. పోతులూరి వీరబ్రహ్మముగారే స్వయముగా యోగీశ్వరుల వారిని తనకు గురువని చెప్పియున్నాడంటే, యోగీశ్వరులు అందించు జ్ఞానము గొప్పదై యుంటుందని చెప్పక తప్పదు. అయితే నేడు క్రమశిక్షణా రాహిత్యమైన హిందూమతములో పుట్టడము వలన, అజ్ఞానులు ఆయన గొప్పతనమును ఏమాత్రము గ్రహించక, హేళనగా కూడా మాట్లాడడము జరుగుచున్నది. దైవజ్ఞానమునుగానీ, హిందూమత ధర్మములనుగానీ ఏమాత్రము తెలియని వారు హిందుత్వములో సిద్ధాంతకర్తయై గతములోనున్న శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్యులకు సమాన స్థాయిలోవున్నా, వారికంటే గ్రంథములను ఎక్కువ వ్రాసినా, నేడు క్రమశిక్షణలేని హిందువులు ఎవరికివారు మేము జ్ఞానులమనుకొనువారు యోగీశ్వరులను హిందువేకాదు

అనడము ఆశ్చర్యమైన విషయము. త్రైత సిద్ధాంతము అను పేరు చూచి ఇది క్రైస్తవము అనీ, యోగీశ్వరులను క్రైస్తవుడనీ, ఆయన పరమతమైన క్రైస్తవమతమును ప్రచారము చేయుచున్నాడనీ, ఆయన హిందువుల ముసుగులో యున్న క్రైస్తవుడు అనడము ఒకవైపు ఆశ్చర్యము, మరొకవైపు బాధను కల్గించు విషయముగా ఉన్నది.

దేవుడు అమృతమును చేతిలో పోసినా, నేలపాలు చేసుకోవడము అంటే ఇలాగేయుంటుందేమో! దేవుడు మనుషులవద్దకు తన జ్ఞానమును పంపితే, దానినే ఇది హిందువుల జ్ఞానముకాదను మనుషులను చూస్తే, 'కుక్కకు టెంకాయ (కొబ్బరికాయ) అబ్బుతుందా!' అను సామెత మతికి రాక తప్పదు. దేవుడు తనకు అందించిన జ్ఞానమును ప్రజలకు పంచాలను ఉద్దేశ్యముతో యోగీశ్వరులవారు గ్రంథములు వ్రాసి, వాటిని ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయండనీ, ప్రజలకు జ్ఞానమును అందివ్వమని చెప్పగా, నేడు యోగీశ్వరుల జ్ఞానమును ప్రచార రథము ద్వారా ఆయన శిష్యులు ప్రతి ఇంటి గడప వరకూ తీసుకపోవుచున్నారు. దానిని చూచి హిందుత్వము ఎప్పుడూ లేనివిధముగా ప్రచారమగుచున్నదని సంతోషపడక, ఇలా ప్రచారము క్రైస్తవులు తప్ప వేరే ఎవ్వరూ చేయరు, హిందువులు అస్సలు చేయరు. కావున ప్రచారము చేయువారు క్రైస్తవులని అనడము జరుగుచున్నది. మేము భగవద్గీతను ప్రచారము చేయుచున్నామని చెప్పినా, భగవద్గీతయంటే తెలియని అజ్ఞానులు దానిని భగవద్గీతయను పేరుతోయున్న బైబిలు గ్రంథము అంటున్నారు. గ్రంథమును తెరిచి చూడండి ఇందులో ఏమున్నదో తెలియగలదంటే, దానికి జవాబుగా మేము మీ గ్రంథములను చూడము, త్రైతము అంటే క్రైస్తవమేనని మాకు బాగా తెలుసు. అందువలన మీరు

మా ఊరిలో మీ జ్ఞానమును ప్రచారము చేయవద్దండి అని చెప్పడము జరుగుచున్నది.

గ్రంథములను చదువరు, చెప్పితే విననుకూడా వినరు. "మీరు క్రైస్తవులయినది మాకు తెలుసు. మీ జ్ఞానమును మా ఊరిలో ప్రచారము చేయకూడదు. మీరు మా మాట వినకుండా ప్రచారము చేస్తే మీ గ్రంథములను అగ్గిపెట్టి తగులపెట్టుతాము. మిమ్ములను తన్నిపంపు తాము" అని మొరటుగా మాట్లాడువారు కూడా కొందరు కలరు. ఇటువంటి అనుభవములు కొన్ని ఊర్లలో యోగీశ్వరుల శిష్యులకు ఎదురయినాయి. **"చేతిలో పోసిన అమృతమును క్రిందపోసుకొన్నారను"** సామెత వీరికికాక ఎవరికి సరిపోతుంది? భారతప్రభుత్వము అందించిన పౌరహక్కులలో భావ ప్రకటన స్వాతంత్ర్యము అందరికీ యున్నది. దానివలన ప్రజలకు అవసరమైన జ్ఞానమును చెప్పవద్దండనడముగానీ, ప్రచారము చేయవద్దండని చెప్పడముగానీ చట్ట విరుద్ధమగును. అయినా చట్ట విరుద్ధముగా మమ్ములను ప్రచారము చేయకుండా అడ్డుకొన్న ఊర్లు కొన్ని గలవు. వాటి పేర్లను చెప్పితే అక్కడ ఎటువంటి జ్ఞానులున్నారో తెలియగలరు.

ఈ దినము 14-10-2014 మంగళవారము. ఇప్పటికి వారము దినముల క్రిందట అనగా 05-10-2014 ఆదివారము మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తిలో ఏమాత్రము జ్ఞాన పరిచయములేనివారు, హిందూ రక్షణ సంఘములో పనిచేయుచున్నామని చెప్పువారు, మా ప్రచార రథమును అడ్డుకోవడము జరిగినది. వారు మేము చేయుచున్నది క్రైస్తవ బోధయని ఆరోపణ చేయడము జరిగినది. మావద్దయున్న గ్రంథములన్నిటినీ చూపి

ఇందులో క్రైస్తవమునకు సంబంధించిన బోధ ఏదైయినావుంటే చూపండి. అలా చూపగలిగితే పదిలక్షల రూపాయలను మీకు ఇస్తామని కూడా మా వారు చెప్పడము జరిగినది. హద్దూపద్దూ లేకుండా పోయిన హిందూ మతములో కేటుగాడు కూడా పోటుగాడే యన్నట్లు, అజ్ఞానులు కూడా పెద్ద జ్ఞానులుగా మాట్లాడడము అలవాటైపోయినది. మావారి మాటను వినకుండా దౌర్జన్యమునకు పూనుకొని పుస్తకములు లాగుకోవడము జరిగినది. అంతటితో ఆగక మా ప్రచారకులలో ఒకరిని కొట్టడము కూడా జరిగినది. కొందరు అలా దాడిచేయగా, మరికొందరు పుస్తకములను చించివేయడము జరిగినది. **"కృష్ణుడు దేవుడే, భగవంతుడే"** అను గ్రంథమును, త్రైత సిద్ధాంత భగవద్గీతను మరికొన్ని గ్రంథములను చించడము జరిగినది. అప్పుడు మా ప్రచారకులు అక్కడినుండి తప్పించుకొని పారిపోయి కల్వకుర్తి పోలీస్ స్టేషన్‌లో జరిగిన సంఘటనను గురించి ఫిర్యాదు చేయడము జరిగినది. అప్పుడు పోలీస్‌వారు ముఖ్యముగా సి.ఐ గారు శ్రద్ధ తీసుకొని వారిమీద కేసు నమోదు చేయడము జరిగినది. ఇదే విధముగా నల్గొండ జిల్లా భువనగిరిలోనూ, కర్నూలు జిల్లా మహానందిలోనూ, అనంతపురం జిల్లా గుంతకల్లులోనూ, రంగారెడ్డి జిల్లా హైదరాబాద్‌లో దిల్‌సుఖ్‌నగర్ లోనూ జరిగినది.

భారత రాజ్యాంగము ఇచ్చిన పౌరహక్కులలో భావప్రకటన మొదటి దగుట వలన ఎవరు దేనినయినా చెప్పుకోవచ్చును. దేవాలయములు, ప్రార్థనామందిరములకు అరకిలోమీటరు పరిధిలో కాకుండా ఎవరు ఏ మతమునయినా ప్రచారము చేసుకొనే హక్కు మనుషులకున్నది. హిందువులు క్రిష్టియన్ చర్చిదగ్గర ప్రచారము చేయుటగానీ, క్రైస్తవులు హిందువుల

దేవాలయముల పరిధిలో ప్రచారము చేయుటగానీ చట్టవిరుద్ధమగును. అంతేతప్ప ఎవరి జ్ఞానమును వారు ప్రచారము చేసుకోవచ్చును. అన్నిటి కంటే గొప్ప వింత ఏమిటంటే మా ప్రచారమును క్రైస్తవులుగానీ, ముస్లీమ్‌లు గానీ ఎవరూ ఇంతవరకు అడ్డుకోలేదు. మాది హిందూ జ్ఞానమని భగవద్గీతా ప్రచారమని తెలిసినా వారందరూ ఎక్కడా వ్యతిరేఖముగా మాట్లాడడము గానీ, వ్యతిరేఖముగా ప్రచారమును అడ్డుకోవడముగానీ చేయలేదు. అయితే మేము చేయుచున్నది హిందూధర్మప్రచారమని చెప్పినా వినకుండా హిందువులమనీ, హిందూ ధర్మరక్షణ సంఘములోని సభ్యులమనీ చెప్పుకొను వారు ఇలా చేయుచున్నారంటే హిందూమతములో క్రమశిక్షణ ఉందా? గురువులంటే భయముందా? అని అడుగుచున్నాను. గుంతకల్లులో సరస్వతీ విద్యామందిరము ముందర భగవద్గీతను నిప్పుపెట్టి కాల్చిన హిందూ రక్షకులను హిందు ధర్మరక్షకులనాలో లేక హిందూ ధర్మ భక్షకులనాలో మీరే చెప్పండి. త్రైత సిద్ధాంతము అంటూనే అది క్రైస్తవమనీ, దేవుడు, సృష్ఠికర్త అని చెప్పితే అలా చెప్పేది క్రైస్తవులేననీ, హిందువులు అంటున్నారంటే వారు ఎటువంటి హిందువులో మీరే చెప్పండి.

హిందువులనువారు ఎందుకింత అజ్ఞానులుగాయున్నారు? ఎందుకు హిందూధర్మప్రచారమును అడ్డుకొని దాడులు చేస్తున్నారని ఆలోచిస్తే, మత రక్షణ చేసుకోవాలను తాపత్రయము తప్ప వారిలో మరేమీలేదని తెలియు చున్నది. ముస్లీమ్‌లు మతరక్షణలో భాగముగా జీహాద్‌యని (పవిత్ర యుద్ధమని) పేరుపెట్టుకొని ఇతర మతస్థులను చంపుచున్నారు. అయితే ఇక్కడ హిందువులలో కూడా మతరక్షణకు కొందరు హిందూధర్మరక్షణ సంఘములలో పనిచేయుచూ, ఇతర మతస్థుల మీద దాడి చేయాలను

ఉద్దేశ్యముతోయుండుట వలన, హిందువులది కూడా పవిత్రయుద్ధమేనని చెప్పవచ్చును. ముస్లీమ్‌లు జీహాద్‌యని పేరుపెట్టి ఇతరులను చంపు చున్నారు. హిందువులు పేరుపెట్టుకోకుండా జీహాద్‌ను చేయుచున్నారు. ముస్లీమ్‌లు చేయునట్లు చేయాలను ఉద్దేశ్యము హిందువులకుయున్నా, ముస్లీమ్‌లు ఇతర మతస్థులను గుర్తించి వారి పెద్దల, గురువుల ఆదేశాల ప్రకారము పనిచేసి ఇతరులను చంపుచుండగా, హిందువులు మాత్రము తమ పెద్దలనుగానీ, గురువులనుగానీ ఆశ్రయించకుండా, తమకు తామే పెద్దలమనుకొని, స్వమతమును కూడా గుర్తించలేని అజ్ఞానములోయుండి, స్వమతస్థులనే హింసించుచున్నారని చెప్పకతప్పదు. మేము హిందువుల ధర్మరక్షణ ఎటువంటిదో ప్రత్యక్ష అనుభవపూర్వకముగా చూచాము. ధర్మమంటే ఏమిటో నిర్వచనముగానీ, ధర్మమంటే ఏమిటో వివరముగానీ, కొద్దిపాటి అర్థముగానీ తెలియనివారు హిందూ ధర్మ రక్షకులమని ప్రజల మీద, స్వమతము మీద అప్రకటిత జీహాద్‌ను చేయుచున్నారని చెప్పు చున్నాము.

నేడు కొన్ని జిల్లాలలో నూటికి ఎనభైశాతము మంది క్రైస్తవులుగా మారిపోయారు. మిగతా జిల్లాలలో కూడా అటువంటి పరిస్థితి రావచ్చును. హిందూరక్షణ ఎలా చేయాలో తెలియనివారు హిందూ రక్షకులైనారు. అలా అగుట వలన హిందూమతమునకు నష్టము తప్ప లాభము ఏమీ లేదు. హిందూమతము క్షీణించకుండా వుండాలంటే హిందూరక్షణకంటే ముందు హిందూధర్మ ప్రచారము మంచిది. క్రైస్తవులు మతప్రచారము తప్ప మతరక్షణ చేయలేదు. వారు వారి మత ప్రచారముతో మతమును కొన్ని జిల్లాలలో 80 శాతము పెంచుకోగలిగారు. ముస్లీమ్‌లు ఒక ప్రక్క

మతప్రచారము, ఒకప్రక్క మతరక్షణ చేయుచున్నా, ప్రపంచములోనే అత్యుత్తమ క్రమశిక్షణగల మతముగా ముస్లీమ్ మతము (ఇస్లామ్) పేరొంది నది. ఆ లెక్కప్రకారము చూస్తే ప్రపంచములో ఏ మతములో లేనంత క్రమశిక్షణారాహిత్యము హిందూమతములో కలదని చెప్పవచ్చును. క్రమశిక్షణ లేనిదానివలన, గురువుల ఆజ్ఞలో పనిచేయని దానివలన, ఎవనికి వాడు మతములో నేనే పెద్ద అనుకోవడము వలన, అగ్రకులములవారు స్వార్థ బుద్ధిని ఉపయోగించి తామే గురువులమనుకోవడము వలన, హిందూ ధర్మములేవో ఏమాత్రమూ తెలియనివారు మతరక్షణ అను ముసుగు వేసుకొని తనవారెవరు, పరాయివారెవరు అని తెలియకుండా దాడులు చేయుట వలన, హిందువుల మూలగ్రంథమేదో హిందువులకే తెలియక పోవడము వలన, భగవద్గీతను చూడనివారు, చదవనివారు హిందూ మతములో మతపెద్దలుగా చలామణి అగుటవలన, హిందూధర్మములను తెలియజేయుచూ, హిందూ మతమునకు దిశా నిర్ణయము చేయు గురువులను గుర్తించకపోవడము వలన, హిందూమత సిద్ధాంతకర్తలను సహితము చులకనగా చూచుట వలన, ఇట్లు అనేక కారణముల వలన హిందూమతము క్షీణించుటకు మొదలు పెట్టినది. పైన చెప్పిన పొరపాట్లనన్నిటినీ హిందువులు సవరించుకోకపోతే క్షీణదశలోయున్న హిందూమతము కొంతకాలమునకు పూర్తి కనుమరుగై పోగలదు. అందువలన ఇప్పటికైనా హిందువులు అజ్ఞాన నిద్రనుండి మేల్కొని, తమ సంస్కృతిని కాపాడుకొని, తమ గురువులను ఎన్నుకొని, వారి ఆధ్వర్యములో హిందుత్వమును నడుపుకొంటే హిందూ మతము తిరిగి పుంజుకోగలదు.

ఈ గ్రంథము పేరు **"జీహాద్ అంటే యుద్ధమా?"** అని వుండుట వలన, హిందువులు కూడా ముస్లీమ్‌లు చేయు జీహాద్ తరహా దాడులు చేయుట వలన, జీహాద్ అనేది ఎంతమటుకు సమంజసమైనదని జీహాద్‌తో ఏమాత్రము సంబంధములేని క్రైస్తవులు ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు. హిందూ, ముస్లీమ్, క్రైస్తవులలో హిందువుల యందు, ముస్లీమ్‌లయందు జీహాద్ అనేది కలదు. జీహాద్ అనునది ముస్లీమ్‌లలో కొందరు గొప్పగా చెప్పుకొంటున్నారు. హిందువులలో జీహాద్ అనే పేరు లేకున్నా, ముస్లీమ్‌లలో యున్న జీహాద్‌ను పోలిన కార్యములయిన దాడులను హిందువులు చేయుచున్నారు. క్రైస్తవులు ఏమాత్రము చేయని దానిని ముస్లీమ్‌లు పేరు చెప్పి చేస్తున్నారు. హిందువులు పేరు చెప్పకుండా చేయుచున్నారు. జీహాద్ అనేదానిని దేవుడు ఎక్కడయినా తన గ్రంథములలో చెప్పాడాయని చూస్తే, ఏ గ్రంథములోగానీ ఆ పేరు ఎక్కడా ప్రస్తావనకు రాలేదు. అయినా ముస్లీమ్‌లు దానిని దేవుని కొరకు చేయు కార్యమని చేయుచున్నారంటే, ఎక్కడో వారు తప్పుదారి పట్టించబడినారని తెలియు చున్నది. సాధారణ ముస్లీమ్‌లను తప్పుదారి పట్టించినది వారి మతబోధకులే యని మనము ముందే చెప్పుకొన్నాము. వారి మతబోధకులే ముస్లీమ్‌లను తప్పుదారి పట్టించారనుటకు మనవద్ద ఒక సాక్ష్యముగలదు. అదేమనగా! ఈ మధ్యకాలములో కంప్యూటర్‌లోని ఫేస్‌బుక్ అను సైట్‌లో క్రొత్తగా జ్ఞానమును తెలుసుకొను ఒక హిందువు, "జీహాద్ అనే పేరుతో మనుషుల ప్రాణములను తీయడము మంచిదా? దేవుడు దానిని ఒప్పుకొంటాడా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు ముస్లీమ్ మత ప్రచార సంఘముల వారు (ఆ సంఘముల పేర్లు ఇక్కడ వ్రాయదలచుకోలేదు.) కంప్యూటర్‌లోనే సమాధానము ఇచ్చారు.

ఫేస్‌బుక్‌లో వారు ఇచ్చిన సమాధానము ఇలా కలదు. "జీహాద్‌ను గురించి మాట్లాడుచూ దేవుడు మనుషులను చంపమని చెప్పాడా? దేవుడు దానిని ఒప్పుకొంటాడా? అని ప్రశ్నించారు. మేము దేవుడు చెప్పిన పనినే చేయుచున్నాము. జీహాద్ అనునది దేవునికొరకు చేయు పవిత్రయుద్ధమని మీరు మరువకూడదు. మీకు ఈ విషయము ఎక్కడ వ్రాశారు అని అనుమానముంటే పవిత్రఖుర్‌ఆన్ గ్రంథములో **"అత్ తౌబా" అనే 9వ సూరాలో 5వ ఆయత్‌లో** చూడండి. మనుషుల గొంతులు కొయ్యమని దేవుడు చెప్పినట్లు మీకే అర్థమవుతుంది" అని వ్రాసియుంచారు. ఫేస్‌బుక్‌లో వారి సమాధానమును చదివిన హిందువు ఆ విషయమును నాతో అడుగడము జరిగినది. దేవుడే స్వయముగా మనుషులను చంపమని చెప్పియుంటాడా! అని నన్ను అతను ప్రశ్నించడమైనది. దానికి దేవుడు ఏ సందర్భములో అలా చెప్పాడో చూచి చెప్పుతానని నేను చెప్పాను. తర్వాత తీరిక సమయములో **9వ సూరాలోని 5వ ఆయత్‌ను** చూచాను. దానిని చూచినవారు ఎవరయినా దేవుడు ఇతర మతస్థులను చంపమని చెప్పాడని చెప్పగలరు. అయితే ఆ వాక్యము చివరిలో **"నిశ్చయముగా అల్లా క్షమించేవాడు, అపారకరుణామయుడు"** అని ఉన్నది. వాక్యము చివరిలో యున్న దేవుడు క్షమాశీలుడు, కరుణామయుడు అను మాటకు పైన చంపమని చెప్పినమాటకు ఏమాత్రము పొంతన కుదరలేదు. ఒకటి తూర్పు, ఒకటి పడమరలాగాయున్నవి. అప్పుడు ఆ వాక్యమును గురించి కొంత యోచించవలసిన పని ఏర్పడినది.

ఇంతకుముందే దేవుని జ్ఞానమును దేవుని వాక్యములను స్థూల అర్థముతో తీసుకోకూడదు అని చెప్పాము. **దేవుని జ్ఞానము 75 పాళ్ళు**

**సూక్ష్మముగా (ముతషాభిహాత్‌గా) యున్నదనీ, కేవలము 25 పాళ్ళు మాత్రము స్థూలముగా (ముహ్కామాత్‌గా) యున్నదని చెప్పకొన్నాము.** ఇక్కడ **9వ సూరా, 5వ ఆయత్‌ను** ఏమాత్రము స్థూలముగా తీసుకోకూడదు. స్థూలముగా అర్థము చేసుకొంటే వాక్యము చివరిలోయున్న దేవుడు క్షమించేవాడు, కరుణగలవాడు అనుమాట తప్పగును, లేక అసత్యమగును. క్షమించేవాడు, కరుణించేవాడు ఎవడుగానీ మనుషులను మనుషులే చంపమని చెప్పడు. అందువలన క్షమించేవాడు కరుణించేవాడు సత్యమయితే మనుషులను మనుషులే చంపమని చెప్పుమాట అసత్యమగును. చంపమని తన ముస్లీమ్‌లకు అల్లా చెప్పియుంటే చివరిలో దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు అని చెప్పియుండడు. ఇక్కడ తప్పు భావమును అర్థము చేసుకొను అవకాశమున్నది. కాబట్టే ఈ వాక్యము చివరిలో దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు అని చెప్పడము జరిగినది. అక్కడ **9వ సూరాలో 5వ వాక్యములో** ఈ విధముగా ఉన్నది. **"నిషిద్ధ మాసాలు గడచిపోయిన తర్వాత చెడుమార్గమున పోవువారినీ, ముష్రిక్కులను (కపటులను) మాట తప్పినవారిని ఎక్కడ దొరికితే అక్కడ చంపండి మరియు వారిని పట్టుకోండి, ఇంకా వారిని చుట్టుముట్టండి మరియు ప్రతిమాటు వద్ద వారికై పొంచియుండండి. అయితే వారు పశ్చాత్తాపపడి నమాజ్ స్థాపించి జకాత్ ఇస్తే వారిని వారి మార్గాన వదలిపెట్టండి. నిశ్చయముగా అల్లా క్షమాశీలుడు, కరుణించేవాడు."** అని గలదు.

ఇక్కడ ఈ సూరాలో ఏముందో బాగా ఆలోచిస్తే, జీహాద్‌కు ఈ ఆయత్‌కు ఏమాత్రము సంబంధము లేదు. అంతేకాక ఈ వాక్యములో చాలా తెలివైన మేధావులు కూడా తప్పు భావములో పడిపోయారు. ఎవరు

ఎవరిని చంపాలని దేవుడు చెప్పాడో ఏమాత్రమూ ఒక్కరు కూడా ఆలోచించ లేదు. ఈ ప్రపంచమును సృష్ఠించడములోనూ, నాశనము చేయడములోనూ మూలకారకుడు దేవుడే. దేవుడు కారకుడేగానీ, కార్యకుడుకాడు, అంటే పనిచేసేవాడు కాదు. ఆయన అనుకుంటే ఏ పనియైనా అట్లే జరిగిపోగలదు. ఇదే విషయమునే **2వ సూరా 117వ ఆయత్‌లో "ఆయన దేనినీ చేయడు. ఆయన చేయదలచిన దానిని అయిపో అంటే అయిపోగలదు."** అని వ్రాయబడియున్నది. దీనినిబట్టి దేవుడు అనుకుంటే లేక చెప్పితే చేసేవారు న్నారని తెలియుచున్నది. దేవుడు ప్రపంచమును పాలించుటకు తన ఆధీనములో ఎందరో పాలకులను పెట్టుకొన్నాడు. దేవుని ఆజ్ఞను నెరవేర్చుటకు కనిపించని పాలకులు దేశమంతా వ్యాపించియున్నారు. తన పాలకులచేత దేవుడు మనుషులను సృష్ఠించాడు మరియు చంపుచున్నాడు. ప్రతి పనికి దేవుడు మూలకారకుడేగానీ, ఆయన పనిని చేయడు. జరుగవలసినపనిని చేయువారూ, ఆయన మాటను ఆచరించు పాలకులూ ఎక్కడపడితే అక్కడ యున్నారు. దేవుడు కనిపించడు, దేవుని పాలకులూ కనిపించరుగానీ, దేవుని పాలనమాత్రము భూమిమీద జరిగి పోతూవుంటుంది. అయితే దేవుడు ఏమి ఆజ్ఞ ఇస్తున్నాడని ఎవరికీ తెలియదు. కావున ఆయన ఆజ్ఞ ఎటువంటిదో తెలియుటకు ఇక్కడ **9వ సూరాలో 5వ ఆయత్‌ను** చెప్పాడు. **దేవుని పాలనను సాగించువారు, ఎవరినయినా శిక్షించువారు, ఎవరికైనా ఏమయినా చేయువారు అయిన తన పాలకులకు నిషిద్ధ దినములలో కాకుండా మిగతా దినములలో ముష్రిక్కులను చంపమని చెప్పాడు. కొంతమందిని బంధించమని చెప్పాడు. కొంతమందిని చుట్టుముట్టమని చెప్పాడు. కొంతమందిని మాటువేసి**

**పొంచియుండండి అని చెప్పాడు.** ఇక్కడ గమనించితే అందరినీ చంపమని చెప్పలేదు. కొందరిని పట్టుకోమనీ, కొందరిని చుట్టుముట్టమనీ, కొందరిని మాటు దగ్గర పొంచి యుండమనీ చెప్పాడు, చెప్పింది దేవుడు, విని ఆచరించవలసినవారు ఆయన పాలకులు లేక దూతలు. ఆయన కొన్ని కార్యములను తన దూతలకు లేక తన పాలకులకు చెప్పితే, మధ్యలో విన్న మనుషులు అది నాకే చెప్పాడనీ, నేనే ఇతరులను చంపుతాననీ, అదే జీహాద్‌యనీ, దేవుని కార్యమును చేయడమే పవిత్రయుద్ధమని ఎందుకు అనుకోవాలి. నీకు సంబంధము లేని వాటిని నీకే చెప్పాడని అనుకోవడము పొరపాటు కాదా! దేవుడు ముష్రిక్కులపట్ల ఈ విధముగా ఆజ్ఞ ఇస్తాడని **9వ సూరా, 5వ ఆయత్‌లో** కలదు. ఆ ఆజ్ఞను నెరవేర్చువారు ఆయన పాలకులుండగా, ఆ కార్యమును నేను చేయాలని మనిషి ఎందుకు అనుకోవాలి?

ఈ వాక్యము మొదటిలోనూ, వాక్యము చివరిలోనూ రెండు గేట్ల లాగా రెండు వాక్యములు కలవు. ప్రారంభములోని మొదటి వాక్యమును, ముగింపులోని చివరి వాక్యమును గమనించితే, ఏమాత్రము తెలివియున్న మనిషి కూడా ఆ వాక్యము మనుషులకు చెప్పినదని అనుకోడు. ఈ వాక్యములో మొదట నిషిద్ధమాసములు గడచిన తర్వాతయని చెప్పబడినది. నిషిద్ధ మాసములు అంటే ఏమిటో ఎవరికయినా తెలుసా? లేకపోతే దేవుడు ఎక్కడయినా ఎవరికయినా ఇవి నిషిద్ధ మాసములని చెప్పాడా? దేవుడు చెప్పలేదు. మనిషికీ తెలియవు. అటువంటి సందర్భములో ఎవరికి ఇష్టమొచ్చినవి వారు నిషిద్ధమాసాలుగా కొందరు ముస్లీమ్ పండితులు చెప్పుకోవడము జరుగుచున్నది. అయినా వారిమాట నిజమని వారికే

నమ్మకము లేదు. అటువంటప్పుడు నిషిద్ధమాసాలు అని దేవుడు ఎందుకు ఆ పేరును అక్కడ చెప్పాడని ఎవరికయినా ప్రశ్నరాగలదు. దానికి జవాబు ఈ విధముగా కలదు. మనిషి పుట్టినప్పుడే అతని కర్మపత్రము ప్రకారము కొంతకాలము సుఖములు, కొంతకాలము కష్టములు అనుభవించాలని దేవుడు నిర్ణయించి పంపియుండును. దేవుని నిర్ణయము ప్రకారము మనిషి సుఖములను అనుభవించు కాలములో కష్టములు అనుభవించుటకు వీలులేదు. అందువలన మనిషి పుణ్యకాలము సుఖములు అనుభవించు కాలమనీ, ఆ సమయము కష్టములు అనుభవించుటకు నిషిద్ధకాలమగుననీ, ఆ కాలములో సుఖములే అనుభవించాలిగానీ, కష్టములు అనుభవించుటకు వీలులేదని తెలియుచున్నది. అందువలన మనిషి పుణ్యకాలమును దేవుడు నిషిద్ధ మాసములనీ, నిషిద్ధ కాలమనీ చెప్పాడు.

కర్మపత్రములో మనిషికి ఉన్న పుణ్యకాలము అతని కష్టములకు నిషిద్ధకాలమగును. అందువలన నిషిద్ధ కాలము మనిషి మనిషికీ వేరువేరుగా యుండును. అట్లయిన మనిషి కష్టముల నిషిద్ధ కాలము, సుఖముల షిద్ధ కాలము ఎప్పుడుండునో ఏ మనిషికీ తెలియదు. షిద్ధము నిషిద్ధము అన్నియూ కర్మపత్రములోని కర్మరహస్యములు. కర్మపత్రమేమిటో, అందులో ఏ కర్మలున్నవో ఏ మనిషికీ తెలియదు. అటువంటపుడు నిషిద్ధకాలము మనిషికి ఎలా తెలియగలదు? తెలియుటకు అవకాశమే లేదు. అయితే ఆ మాటను చెప్పినది మనిషికికాదుయని జ్ఞాపకముంచుకోవలెను. దేవుడు నిషిద్ధకాలమును గురించి చెప్పినది తన క్రిందయున్న పాలకులకు. దేవుని పాలకులకు మనుషుల తలలోని కర్మ, అందులోని పాపపుణ్యములు తెలుసు. దేవుడు చెప్పినట్లు మనిషి పుణ్యకాలమయిన నిషిద్ధకాలమును వదలి పాప

కాలము వచ్చిన వెంటనే వారికున్న కర్మప్రకారము కొందరు చంపబడుదురు, కొందరు బంధింపబడుదురు, కొందరు ముట్టడించబడుదురు. దేవుడు చెప్పినట్లు ఎవరికి ఏమి జరుగవలెనో వాటినన్నిటినీ, కంటికి కనిపించని దేవుని పాలకులు చేయుదురు. మనిషి పుట్టినప్పటినుండి ఎవడూ దేవుని పాలకుల ఆధీనములో లేకుండా బ్రతుకలేదు. వాని జీవితములో ఏమి కావలసియుంటే అవి, ఏమి జరుగవలసియుంటే అవి జరుపువారు దేవుని పాలకులే. దేవుడు ఏమీ చేయకయుండును. చేయవలసిన పనులన్నిటినీ దేవుని పాలకులే చేయుదురు.

ఎంతటి కర్మను (పాపమును) చేసుకొన్నవాడుగానీ, వాడు దేవుని మార్గమును అనుసరించి, దేవుని జ్ఞానమును తెలియగలిగితే, అటువంటి వాని పాపమును దేవుడు క్షమించును. దైవజ్ఞానము లభించినవాని కర్మలు అగ్నిలో కట్టెలు కాలిపోయినట్లు జ్ఞానమను అగ్నిలో కాలిపోవునని భగవద్గీతలో భగవంతుడు చెప్పాడు. అందువలన దేవున్ని పై వాక్యములో క్షమించువాడని అన్నారు. దేవుని జ్ఞానమును తెలిసి దేవుని మార్గములో పయనించువాని కర్మలు (పాపములు) కాలిపోవునట్లు, దేవుడు చేయు చుండుట వలన దేవున్ని కరుణామయుడు అన్నారు. మనుషులు దేవున్ని కరుణామయుడు, దయామయుడు అనినా, దేవునికి వాస్తవముగా కరుణ లేదు, దయలేదు. ఆయన గుణములకు అతీతుడు.

ఒక మనిషి తన జీవితమును ఎలా గడుపుచున్నదీ, అతను ఎవరి ఆధీనములో బ్రతుకుచున్నదీ, ఎవరి ఆధీనములోవుండి చనిపోవునదీ మనిషికి తెలియునట్లు **దేవుడు 9వ సూరా, 5వ ఆయత్‌ను చెప్పాడు.** ఈ ఆయత్‌లో

మనిషియెడల దేవుడు తన ఆజ్ఞను ఏమని తన పాలకులకు ఇచ్చుచున్నాడో అర్థమగులాగున పై వాక్యము కలదు. అయితే ఈ వాక్యములో ఇంత సారాంశముయున్నదని తెలియని మనుషులు, మనుషలను చంపమని చెప్పినదీ, బంధించమని చెప్పినదీ, తమకేనని అలా చేయడమే పవిత్రయుద్ధ మని అనుకొంటున్నారు. అలా అనుకోవడము పెద్దపొరపాటగును. అది తన దూతలకు, పాలకులకు చెప్పినమాటగానీ, మనుషులకు చెప్పిన వాక్యముకాదు. దానిని **"జీహాద్"** అని చెప్పుట పూర్తి తప్పగును. ఈ వాక్యమునకూ జీహాద్ అనే దానికీ పోలికే లేదు. జీహాద్ అంటే మనుషులను చంపడము అసలే కాదని తెలియాలి.

జీహాద్ అంటే పవిత్రయుద్ధము అని అర్థముంటే, అది పవిత్రమైన కార్యముగా ఉండాలిగానీ, మనుషులను చంపు అపవిత్రకార్యముగా ఉండకూడదు. ఒక మనిషి ఇతర మనుషలను చంపడము పాపముపని యగును. అందువలన అది అపవిత్రకార్యమగును, పవిత్రకార్యము కాదు. పవిత్ర యుద్ధమంటే ఒక విధముగా అది యుద్ధమేకాదని చెప్పవచ్చును. దేవుని మార్గములోని పోరాటమును పవిత్రయుద్ధము అని అనవచ్చునుగానీ, సాటి మనుషలను చంపునది పవిత్రత అనిపించుకోదు. అటువంటి కార్యములు పవిత్రయుద్ధము కానేకావు. అన్ని విధముల ఆలోచించినా చివరకు దేవుని మార్గములో శ్రమపడడమును పవిత్రయుద్ధముగా చెప్పవచ్చును. దేవుని మార్గమంటే ఏమిటి? అది ఎక్కడున్నది? ఎట్లుంటుంది? అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి సరియైన సమాధానము చెప్పితే దేవుని మార్గము సూక్ష్మమైనది, స్థూలమైనది కాదు. అందువలన అది కంటికి కనిపించునది కాదు. అటువంటి మార్గమును

ఇట్లుంటుందియనిగానీ చెప్పుటకు వీలులేదు. దేవున్ని తెలియుటకు చేయు కార్యములనే దేవునిమార్గము అనవచ్చును. అటువంటి కార్యములో పడే శ్రమను దేవుని మార్గములో పోరాటము అని చెప్పవచ్చును.

ఒక్కొక్క మతములో ఒక్కొక్క విధముగా దేవున్ని తెలియు విధానములు గలవు. హిందూమతములో కర్మయోగము, బ్రహ్మయోగము, భక్తియోగము అను మూడు యోగములు గలవు. ఈ మూడు యోగములలో ఒక్క యోగమును ఆచరించినా అది దేవునిమార్గములో ప్రయాణించి నట్లగును. యోగములను ఆచరించడములో పడు శ్రమను దేవుని మార్గములో పోరాటము అని అనవచ్చును. క్రైస్తవమతములోని భక్తి ప్రకారము చర్చికి పోయి ప్రార్థన చేయడమూ, బైబిలు గ్రంథమును చదవడమూ దేవుని మార్గములో ప్రయాణించినట్లగును. ఇక ముస్లీమ్ మతములో దేవున్ని తెలియుటకు నాల్గు విధముల శ్రమను పడవలెను. ఆ నాల్గు విధములను ఆచరించినప్పుడు వాడు దేవుని మార్గములో ప్రయాణించి నట్లగును. నాల్గు విధముల దేవుని ఆరాధనలో పడుశ్రమను దేవుని కొరకు చేయు పోరాటము అని చెప్పవచ్చును. దానినే పవిత్రయుద్ధము అని కూడా చెప్పవచ్చును. మొత్తముమీద దేవుని మీద విశ్వాసమును ఒక్కొక్క మతములో ఒక్కొక్క విధముగా మనుషులు ప్రదర్శించుచున్నారు. హిందూ మతములో దేవుని మార్గము యోగముల రూపములోయుండగా, క్రైస్తవ మతములో ప్రార్థన రూపములోయున్నది. ముస్లీమ్‌ల విషయానికి వస్తే దేవుని మార్గము నాలుగు మార్గములుగాయున్నది. అవి వరుసగా 1) నమాజ్, 2) జకాత్, 3) రోజా, 4) హజ్ అని గలవు. నమాజ్ అంటే ప్రార్థన, జకాత్ అంటే దేవునికి కానుకలివ్వడము, రోజా అంటే

ఉపవాసముండడము, హజ్ అంటే మక్కాయాత్ర చేయడము అని వివరము గలదు. ముస్లీమ్ అయినవాడు ఈ నాలుగు విధానములలో దేనిని ఆచరించినా దేవుని మార్గములో యున్నట్లే. అయితే దేవుడు నమాజ్, జకాత్ అను రెండు ఆచరణలే ఖురాన్‌లో 9వ సూరా 5వ ఆయత్‌లో ప్రస్తావించాడు.

ఇప్పుడు తిరిగి **9వ సూరా, 5వ ఆయత్‌లోనికి** వస్తాము. ఆ వాక్యములో మనము చెప్పుకోవలసినది ఇంకా కొంతయున్నది. దేవుడు ముష్రిక్కులను (కపటులను, మాట తప్పినవారిని) నాల్గురకముల శిక్షించమనీ, చంపమనీ చెప్పిన తర్వాత ఒకవేళ వాడు పాశ్చాత్తాపపడి నమాజ్‌ను స్థాపించి, జకాత్‌ను ఇస్తే వారిని వారి మార్గాన వదలిపెట్టండి అని వున్నది కదా! నమాజ్, జకాత్ ముస్లీమ్ మతములోని ఆరాధనా మార్గములని వాటినే దేవుని మార్గమని చెప్పుకొన్నాము. ఒకవ్యక్తి ముస్లీమ్‌గా పుట్టి నమాజ్ చేయకుండా, జకాత్ ఇవ్వకుండాయుంటే అట్టివానిని మాట తప్పినవాడనీ, తన మతములోనున్న మాటను తప్పినవాడనీ, కపట హృదయము కలవాడనీ చెప్పవచ్చును. అప్పుడు అటువంటి వానిని శిక్షించమని దేవుడు తన దూతలకు చెప్పడము జరిగినది. ఆ విధముగా దేవుని పాలకులు శిక్షించినప్పుడు ఎవడయినా తన తప్పును తాను తెలుసు కొని, పాశ్చాత్తాపపడి దేవుని మార్గమును అనుసరించాలని తలచి దేవుని ప్రార్థన అయిన నమాజ్ చేస్తూ, జకాత్‌ను ఇస్తే వాడు దేవుని మార్గములోనికి వచ్చినట్లేయగును. అప్పుడు వానిని శిక్షించవలసిన పనిలేదు. వాని తప్పులన్నీ దేవుడు క్షమించుట వలన దేవుని పాలకులు అతనిని శిక్షించ కుండా వానిని వాని మార్గమున వదలిపెట్టమని చెప్పినట్లు ఆ వాక్యములో

గలదు. వానిని వానిమార్గమున అని అంటే వాడు అనుసరిస్తున్న దేవుని మార్గమున అని అర్థము. అలా వదలిపెట్టుట వలన వానిని శిక్షనుండి క్షమించినట్లగుచున్నది. అందువలన దేవుడు క్షమించువాడు అని వాక్యము చివరిలో చెప్పడమైనది.

ఇంత వివరముగా చెప్పినప్పటికీ కొందరు నిషిద్ధ కాలము లేక నిషిద్ధ మాసములు అను మాట దగ్గర కొంత అనుమానము కల్గి మా మాటను నమ్మకుండాయున్నారు. అటువంటివారికి ముస్లీమ్ పెద్దలు చెప్పిన వివరమును చూడమని ఇక్కడ ఆ వివరమును పొందుపరుస్తున్నాను చూడండి. ("అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్" అను గ్రంథములో మహా జ్ఞాని 'హాఫిజ్ సలాహుద్దీన్ యూసుఫ్" గారు వ్రాసిన వ్యాఖ్యానమును ఇక్కడుంచాము.) **("నిషిద్ధమాసాలంటే ఏవి? ఈ విషయముపై భిన్నాభిప్రాయములున్నాయి. 1) రజబ్ 2) జీఖ అద 3) జల్‌హజ్ 4) ముహర్రమ్ అను నాలుగు మాసాలే నిషిద్ధమాసములని ఒక అభిప్రాయముంది. అయితే జల్‌హజ్ నెల 10వ తేదీన ఈ ప్రకటన వెలువడింది. ఈ రకముగా ఈ ప్రకటన వెలువడిన రోజు నుండి కేవలము 50 రోజుల గడువు ఇవ్వబడింది. ఈ గడువు ముగియ గానే ముష్రిక్కులను పట్టుకొని వారిని హతమార్చేందుకు అనుమతి ఇవ్వబడింది. అయితే ఇమామ్ ఇబ్నె కసీర్ ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు. ఈ ఆయత్‌లో ప్రస్తావింపబడిన నిషిద్ధ మాసాలు ఆ నిషిద్ధ మాసాలు కావనీ, వాస్తవానికి ఇది జల్‌హజ్ 10వ తేదీనుండి రబీవుస్సానీ 10వ తేదీవరకు గల గడువు అని ఆయన అభిప్రాయ పడ్డాడు. మరి వీటిని నిషిద్ధ మాసాలు (అష్‌హురే హురుమ్) అని**

**ఎందుకు అనడము జరిగింది? అని అంటే తెగత్రెంపుల ప్రకటన జరిగిన తర్వాత ఆ నాలుగు నెలల్లో ముష్రిక్కులు యుద్ధము చేయటానికి గానీ, వారికి వ్యతిరేఖముగా ఎటువంటి చర్యనుగైకొన టానికిగానీ, అనుమతి లేకపోయింది. తెగత్రెంపుల ప్రకటన జరిగిన తీరును బట్టి ఈ రెండవ అభిప్రాయమే సహేతుకము అనిపిస్తోంది. వాస్తవము అల్లాహ్‌కే ఎరుక")**

వాస్తవముగా దైవజ్ఞానమును అనుసరించి ఫలానా దినములే నిషిద్ధమాసములని చెప్పుటకు వీలులేదు. ఎవరి కర్మనుబట్టి వారికి నిషిద్ధ కాలముండునని చెప్పవచ్చును. పైన చెప్పిన **5వ ఆయత్** వాక్యమును బాగా అర్థమగుటకు తర్వాత భవిష్యత్తులో అనుమానములు రాకుండుటకు **9వ సూరాలోనే "6వ" ఆయత్‌ను** కూడా వివరించి చెప్పుకుంటే జీహాద్ మీదయున్న భ్రమ అంతయూ తొలగిపోవును. ఆరవ ఆయత్ ఈ విధముగా కలదు. **"ఒకవేళ ముష్రిక్కులలో ఏ వ్యక్తి అయినా నీ శరణు కోరితే, అతను దైవజ్ఞానమును వినేంతవరకు అతనికి నీవు ఆశ్రయము ఇవ్వు. ఆ తరువాత అతనిని అతని సురక్షిత స్థానానికి చేర్చు. వారు జ్ఞానము తెలియని వారగుటచేత, వారిపట్ల నీవు ఈ విధముగా వ్యవహరించు".** ఇప్పుడు ఈ వాక్యములో కూడా మన తెలివిని ఉపయోగించి భావమును అర్థము చేసుకోవలెను. అట్లుకాకుండా పైపైన చూడగలిగితే మరియొక రకముగా అర్థమగును. అందువలన వాస్తవము తెలియునట్లు ఈ వాక్యమును గురించి యోచించాలి. దేవునిమార్గములో నాలుగు పనులను చెప్పినా అందులో వెనుకలగల రోజా, హజ్‌లకంటే ముఖ్యమైనవి నమాజ్, జకాత్‌యని తెలియాలి. మనిషి అజ్ఞానములోయుండి దేవదూతల చేత

శిక్షింపబడునప్పుడు, వారి హృదయములో మార్పువచ్చి జ్ఞానమార్గములో పోవాలనుకొన్నవాడు అంతరంగములో నేను ఈ బాధలనుపడలేను. నేను ఇప్పటి నుండి దైవమార్గములో ప్రయాణిస్తానని అనుకొనువాడు దేవున్ని శరణు జొచ్చినట్లే, అప్పుడు దేవుని దూతని కూడా శరణుజొచ్చినట్లేయగును. దేవుడు ఏమీ చేయనివాడు కావున అప్పుడు వాని శరణ్యమును వానిని శిక్షించు దూత లేక పాలకుడు అయినవాడే స్వీకరించవలెను. అటువంటి వానికి దైవజ్ఞానమును తెలియునట్లు దేవదూతయే అవకాశము కల్గించును. అతనికి దైవజ్ఞానము తెలియునంతవరకు దేవదూత ఏ శిక్ష విధించకుండా వుండును. అప్పుడు మనిషి దేవదూతయొక్క ఆశ్రయములో ఉన్నట్లే లెక్క. అతడు సంపూర్ణ జ్ఞానము తెలిసిన తర్వాత వానికి ఏ బాధ విధించకుండా దేవదూత వానిని వదలిపెట్టును. అప్పుడు వానిని సురక్షిత స్థానములో వదలి పెట్టినట్లే యగుచున్నది. జ్ఞానము తెలియని మనుషుల ఎడల దేవుడు తనదూతను కఠినముగా ప్రవర్తింప చేయకుండా చేయడమేకాక, ఆ మనిషికి జ్ఞానమును తెలియునంతవరకు కాచుకొనియుండి జ్ఞానమును తెలుసు కోగల్గితే, వానిని సురక్షితముగా వదలిపెట్టునట్లు చేయుచున్నాడు. ఒకవేళ వాడు జ్ఞానమును తెలియకుండా తిరిగి అజ్ఞానము వైపుపోతే, వానికి దూతనుండి రక్షణ యుండదు. దూత తప్పక వానిని పీడించి సురక్షితముగా లేకుండా చేయును.

9వ సూరా 5,6 వాక్యములనుబట్టి ఒక మనిషిని హింసించువాడు గానీ, రక్షించువాడుగానీ, వానివద్దయున్న పాలకుడేయని తెలియుచున్నది. మనిషి దేవుని జ్ఞానము తెలియగలిగితే, దూతనుండి రక్షణ ఉంటుంది. జ్ఞానమును తెలియకపోతే, దూతనుండి శిక్షయుంటుంది. ఇది ముస్లీమ్‌లకు

మాత్రమే చెప్పిన జ్ఞానము అని అనుకోకూడదు. ఇందులో చెప్పిన జ్ఞానము అన్ని మతస్థులకూ వర్తించును. అందువలన మతరక్షణకని ఒక మనిషి మరొక మనిషిని హింసించడముగానీ, చంపడముగానీ చేస్తే అది తప్పక పాపమగునుగానీ, దేవునిమార్గములో మంచిపనికాదు. దేవుని కొరకు చేయు పవిత్రయుద్ధమూ కాదు. ఈ మధ్యకాలములో మతద్వేషములతో ఒకరినొకరు చంపుకొనుచూ దానిని పవిత్రయుద్ధమని అనుకొంటున్నారు. మతములకొరకు, మతరక్షణకొరకు ఒకరినొకరు చంపుకోవడము అన్ని మతములలో జరుగుచున్నది. అయితే ముస్లీమ్‌లు ప్రత్యేకించి పవిత్ర యుద్ధమనీ, దేవునికొరకు చేయు కార్యమనీ దానినే జీహాద్ అని చెప్పు చున్నారు. అలా ముస్లీమ్‌లు చెప్పుటకు చేయుటకు కారణము వారి వెనుకయున్న ముస్లీమ్ పెద్దలనియే చెప్పవచ్చును. వారు చేయు పవిత్ర యుద్ధము వెనుక స్వమతరక్షణ, పరమత నాశనము తప్ప ఏమీ లేదు. ముస్లీమ్‌లు జీహాద్ అని పేరుపెట్టి చేయుచున్నా, హిందువులు పేరు పెట్టకుండా చేయుచున్నా ఇద్దరి పని ఒక్కటేయగుచున్నది. ఒక్క ముస్లీమ్ మతమనిగానీ, హిందూమతమనిగానీ చెప్పవలసిన పనిలేదు గానీ, నేడు అన్ని మతములలోనూ స్వమత రక్షణ, పరమత నాశనము అను ఉద్దేశ్యమే యున్నది. స్వమత రక్షణయున్నప్పుడు తప్పనిసరిగా పరమతద్వేషము ఉంటుంది. పరమత ద్వేషము చివరకు హింసగామారడము జరుగుచున్న పనియే.

స్వమత రక్షణ, పరమత భక్షణ అను విధానమును దేవుడు ఏమాత్రము ఒప్పుకోడు. దేవుడు భూమిమీద ప్రతి దానిని సృష్టించాడు. అలాగే మనుషులను తరగతులుగా విభజించి స్వర్గ, నరకములకు పంపుటకు

దేవుడు మనుషుల వెనుకయుండి ముఖ్యముగా మూడు మతములను సృష్టించాడు. అలా మూడు మతములుగా సృష్టించినందుకు మూడు మతముల వారికి కొద్దిపాటి తేడాతో, కొంత హెచ్చు తగ్గులుగా తన జ్ఞానమును తెలియజేశాడు. దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములలో నింపి ఇచ్చాడు. మూడు గ్రంథములలో జ్ఞానము సమానముగాయున్నా, ఆ గ్రంథములలో కలిపిన మసాలాలు వేరువేరుగా యుండుట వలన, ఎవరి రుచి వారిది అన్నట్లు, ఎవరి జ్ఞానము వారిదే అయినది. అందరి జ్ఞానము ఒకటే అని తెలియలేకపోవుచున్నారు. మూడు మతములలో మనుషులు ఒకేజాతివారే, మూడు మతములలోని జ్ఞానము ఒకే జ్ఞానమే. అయినా మనుషులు నేను ముస్లీమ్, నీవు హిందువు, వాడు క్రైస్తవుడు అని వేరు వేరు బేధములు కల్గి ప్రవర్తించుచున్నారు. మనుషులనుబట్టి గ్రంథములలో జ్ఞానము కూడా అట్లేయున్నదనుకొంటున్నారు. జ్ఞానమును బేధముగా చూచుటవలన వారి మతమువేరు, మా మతమువేరని అభిప్రాయము వచ్చినది. చివరకు గ్రంథములలోని విషయము అర్థము కాకపోయిన దానివలన, స్వమతము మీద అభిమానము పెరిగిపోయి, పరమతము మీద దురభిమానము ఎక్కువయిపోయినది. దానివలన కొందరిలో పరమతమును హింసించాలన్న బుద్ధి పుట్టినది. మరికొందరిలో స్వమతమును పెంపొందించాలన్న యోచన వచ్చినది. ఈ రెండు యోచనల వలన అందరూ ఇతర మతముల మీద ద్వేషము పెంచుకొంటూ వచ్చారు. చివరకు ముస్లీమ్‌లు జీహాద్ అను పేరుతో ఇతర మతముల వారిని లేకుండా చేయాలనుకొన్నారు. దానికి తోడు **9వ సూరా 5వ ఆయత్‌లోనే** దేవుడు చెప్పిన వాక్యము అర్థము కాకుండా అపార్థమై పోయినది. దానితో దేవుడే

చంపమని చెప్పాడని అర్థమగుటవలన, జీహాద్‌కు (పవిత్రయుద్ధమునకు) లైసెన్సు దొరికినట్లయినది. అంతటితో ముస్లీమ్ పెద్దలు తప్పుదారిని సాధారణ ముస్లీమ్‌లకు చూపి, ఇదే దేవునిమార్గమని బోధించడముతో, భూమిమీద మతద్వేషముల ద్వారా హింస పెరిగిపోయినది. నేడు ఎక్కడ యుద్ధము జరిగినా, ఎక్కడ కలహములతో హింస జరిగినా, ఎక్కడ కారుబాంబు ప్రేలినా, ఎక్కడ ఒక్కని ఆత్మాహుతి దాడితో ఎక్కువమంది చనిపోయినా, అక్కడ మతద్వేషమునకు సంబంధించిన కారణమే కనిపించు చున్నది. ముస్లీమ్‌లలో ఉగ్రవాద భూతములున్నట్లు చెప్పుకొను హిందువులలో కూడా మతవాద దయ్యము దూరుకొని, ఎక్కడ జ్ఞాన ప్రచారము జరుగుచున్నా అక్కడ ఇది హిందువులదా లేక ఇతర మతముల వారిదా అని ఆలోచించక, అక్కడి ప్రచారకులను పరమత ప్రచారకులని పేరుపెట్టి హింసించుచున్నారు. ఇక్కడ జరుగుచున్నది హిందూ జ్ఞాన ప్రచారమే కదా! యని ఎవరయినా మతవాద దయ్యము పూనినవారిని అడిగితే, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేసేది క్రైస్తవులే అంటారు. వారి లెక్కలో ఇల్లిల్లూ తిరిగి హిందువులు ప్రచారము చేయకూడదనేగా అర్థము. ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయువారందరూ క్రైస్తవులే అవుతారా?

ఎక్కడయినా ఉచితముగా గ్రంథములు పంచితే, అందులోని జ్ఞానము చూడకుండానే, ఉచితముగా పంచేది క్రైస్తవులే అని అంటారు. ఉగ్రవాద భూతము పూనిన ముస్లీమ్‌లు హిందువులమీద బాంబు వేస్తే కొందరే చనిపోతారు. అయితే మతవాద దయ్యము పట్టిన హిందువులు చేయు జ్ఞానప్రచార ఆటంకములకు, కొన్ని వందలమంది హిందువుల హృదయములు చచ్చిపోతున్నాయి. హిందూ మతదయ్యము ఆవహించిన

వారు చేయు ఆటంకములకు, దాడులకు కొన్ని వేలమంది మానసికంగా చనిపోయి, హిందూమతమును వీడి ఇతర మతములలోనికి పోతామను కొంటున్నారు. హిందూమతములోని అంటరానితనమునకు అగ్రవర్ణము వారు చేయు పెద్దరికమునకు, దైవజ్ఞానము తెలియకుండా పరమతమని అడ్డుకోవడమును చూచి, ఈ మతములోవుంటే ఎప్పటికీ దేవుని జ్ఞానము తెలియదను నిశ్చయమునకు వచ్చి, ఇతరమతములలోనికి పోయి అక్కడ కొంత జ్ఞానమును తెలుసుకొన్నవారు కలరు. విజయనగరము జిల్లాలో ఒక హిందువు హిందూమతములో జ్ఞానము తెలియలేదని ఇస్లామ్ (ముస్లీమ్) మతములోనికి పోయాడు. అక్కడ తనకు జ్ఞానము ఏమీ అర్థముకాలేదని తిరిగి అక్కడనుండి క్రైస్తవములోనికి పోయాడు. క్రైస్తవ మతములోనికి పోకముందే నాకు జ్ఞానము తెలిస్తే మీ మతములో ఉంటాను లేకపోతే మీ మతములో కూడా ఉండనని చెప్పి ఒప్పందము చేసుకొని క్రైస్తవ మతము లోనికి పోయాడు. ఆ వ్యక్తి 2009వ సంవత్సరము విశాఖపట్టణము దగ్గర అగనంపూడి గ్రామములో నాతో కలిసినప్పుడు, అతను నాతో చాలాసేపు మాట్లాడినాడు. అతని పేరు క్రియేటర్ ప్రేమకుమార్ అని కలదు. ఆ దినము మా మధ్యన జరిగిన సంభాషణలో అణగారిన సాధారణ హిందువుల మనోభావములు ఎలా ఉన్నాయో నాకు బాగా అర్థమయినది. ఆ సంభాషణను క్రింద పొందుపరుస్తున్నాము చూడండి.

**ప్రేమ్ :-** స్వామీజీ! మీతో కలిసి మాట్లాడాలని వచ్చాను.

**నేను :-** మీరు ఎవరో నాకు తెలియదు. మీరు దేనికొరకు వచ్చారు?

**ప్రేమ్ :-** విజయనగరములో మిమ్ములను గురించి మీ భక్తులు చెప్పుతూ వుంటే విన్నాను. నాలో కొన్ని జ్ఞానసంశయములున్నవి, వాటిని మీవద్ద

చెప్పి నా సంశయములు తీర్చుకోవాలనుకొన్నాను. అందువలన అదేపనిగా వంద కిలోమీటర్ల దూరమునుండి వచ్చాను.

**నేను :-** నీ సంశయములకు నావద్ద జవాబు లేకపోవచ్చును. నాకు జ్ఞానము సంపూర్ణముగా తెలుసునని నాకే నమ్మకము లేదు. అంతకు నీవు ఏమి పని చేస్తుంటావు. నీపేరేమి?

**ప్రేమ్ :-** నా పేరు ప్రేమకుమార్ అయితే అందరూ క్రియేటర్ ప్రేమకుమార్ అని అంటూవుంటారు. నేను ప్రస్తుతము పాస్టర్‌గా ట్రయినింగ్ తీసుకొని పాస్టర్‌గా పని చేయుచున్నాను.

**నేను :-** పాస్టర్ అంటే క్రైస్తవ బోధకుడుగా పనిచేయుచున్నావా?

**ప్రేమ్ :-** అవును, క్రైస్తవ బోధకునిగాయున్నాను. నేను మొదట హిందువునే. కొన్ని సంవత్సరముల క్రిందటే క్రైస్తవమతములోనికి వచ్చాను.

**నేను :-** గుంటూరు నుండి మొదలుపెడితే శ్రీకాకుళము జిల్లావరకు హిందువులందరూ దాదాపు 80 శాతము మంది క్రైస్తవులుగా మారి పోయారనుకుంటాను. అందులో నీవు కూడాయున్నావు. నేనున్న రాయల సీమ ప్రాంతములో 30 లేక 40 శాతము మారిపోయారేమోగానీ, ఈ ప్రాంతములో మరీ ఎక్కువగా మతమును మార్చుకొన్నారు. ఇక్కడ అంత ఎక్కువగా మతము మారుటకు కారణమేమి? ముందు నీవు ఏమి లాభమును ఆశించి మతమును మారావు?

**ప్రేమ్ :-** నేను ఏదో లాభము వస్తుందను ఆశతో మతమును మార్చుకోలేదు. నేను దేవుని కొరకు, దేవుని జ్ఞానము కొరకు మతమును మార్చుకోవలసి వచ్చినది. ఇతరుల విషయము నాకు తెలియదుగానీ నా విషయములో ఇంతకంటే వేరు ఉద్దేశ్యమే లేదు.

**నేను :-** అన్నిటికంటే ముందు పుట్టినది హిందూమతము, అన్ని గ్రంథముల కంటే ముందు భగవద్గీత వచ్చినది. అన్ని మతముల జ్ఞానమునకు ఆధారముగా హిందూ జ్ఞానమున్నది. అలాంటప్పుడు పరిపూర్ణముగాయున్న జ్ఞానమును వదిలిపెట్టి ఇతర మతములోని దేవుని కొరకు, దేవుని జ్ఞానము కొరకు పోయానని చెప్పుచున్నావు. ఇక్కడ దేవుడూ, దేవుని జ్ఞానమూ తెలియబడదని ఎవరయినా చెప్పారా? ఇతర మతములోనికి పోతే దేవుడు తెలియబడతాడని చెప్పారా? హిందూమతముకంటే క్రైస్తవమతములో నీకు ఏమి గొప్పగా కనిపించినది?

**ప్రేమ్ :-** నేను హిందూమతమును వీడిపోవుటకు మీరు అడిగినవేవీ కారణము కాదు. నేను హిందుమతమునుండి మొదట క్రైస్తవమతములోనికి రాలేదు. నేను కొన్ని సంవత్సరముల క్రిందటే ముస్లీమ్ మతమును స్వీకరించాను. తర్వాత ముస్లీమ్ మతమునుండి క్రైస్తవ మతములోనికి వచ్చాను. ముస్లీమ్ మతములోకంటే, హిందూమతములోకంటే కొంత ఎక్కువ హెూదాలో ఈ మతముయందు యున్నాను. రెండు మతములను మారినా నేను నా లాభముకొరకుగానీ, మరి యే కోర్కెకొరకుగానీ మారలేదు. నేను జ్ఞానాభిలాషినై విధిలేక మతమును మారాను తప్ప మరి యే ఇతర కారణమూ లేదు. ఇప్పుడు మీ దగ్గరకు వచ్చాను. నేను ఏ ప్రపంచ లాభమునూ కోరి మీ వద్దకు రాలేదు కదా! నాకు దాహము వేసింది, నా దప్పిక తీరే దానికి నీళ్ళు త్రాగాను. నేను త్రాగిన నీరు ఉప్పునీరు దానితో దాహము తీరలేదుగానీ మరిఎక్కువ దాహమయినది. మంచినీటికొరకు ఇతరులను, ఇతర మతములను ఆశ్రయించాను. ఎక్కడా మంచినీరు దొరకలేదు. ముస్లీమ్ మతములో కూడా అసంతృప్తి చెంది, క్రైస్తవములోనికి వచ్చాను.

**నేను :-** ఇక్కడయినా నీ దాహము తీరిందా?

**ప్రేమ్ :-** ఇక్కడ క్రైస్తవ మతములో నాకు ఒక బిందె, ఒక గ్లాసు ఇచ్చారు. నీవు త్రాగేదే కాక నీ దగ్గరకు వచ్చినవాళ్ళకు కూడా నీరును త్రాపమని చెప్పారు. ఇప్పుడు నేనే ఇతరులకు తాపే బాధ్యతలోయున్నాను.

**నేను :-** ఇక్కడ క్రైస్తవములో అయినా ముందు నీ దాహము తీరిందా, నీవు ఇతరులకు దాహమును తీర్చావా?

**ప్రేమ్ :-** నాకు ఒక పెద్ద సముద్రమును చూపి నీ ఇష్టమొచ్చినన్ని నీళ్ళు నీవు త్రాగు మరియు ఇతరులకు కూడా త్రాపమని చెప్పారు. సముద్రమును చూచి అది ఎంత పెద్దగాయున్నా దానిలో కూడా ఉప్పునీరేకదా ఉండేది! అని అనుమానము వచ్చినది. ఏమీ అర్థముకాక మీ వద్దకు వచ్చాను.

**నేను :-** దేవుడు శ్రద్ధనుబట్టి జ్ఞానము దొరుకుతుందని చెప్పాడు. నీకు ఉన్న శ్రద్ధనుబట్టి జ్ఞానము లభించాలి. నీకు సరియైన జ్ఞానము లభించలేదు అంటే నీలోనే శ్రద్ధాలోపమున్నదని అర్థమగుచున్నది.

**ప్రేమ్ :-** నాకు శ్రద్ధలో లోపములేదు. జ్ఞానము మీద శ్రద్ధయుంది కాబట్టే, దానికొరకు మతమును కూడా మారాను.

**నేను :-** నీకు శ్రద్ధయున్నదను నమ్మకముంటే తప్పక సరియైన జ్ఞానము లభించుతుంది. అటువంటి శ్రద్ధయున్నప్పుడు హిందూమతములోనే యుంటే చివరకు జ్ఞానము లభించేది కదా!

**ప్రేమ్ :-** మీరు చెప్పినమాట సత్యమే అయివుండవచ్చును. అయితే నేను ఎటువంటి పరిస్థితిలో మతము మారానో మీకు కొంచెము వివరముగా చెప్పుతాను. తర్వాత నాదేమయినా తప్పుయుంటే చెప్పండి. నాకు హైస్కూలు చదువు అయిపోయిన తర్వాత ఇంటర్‌కు పోవుటకు ఒక

సంవత్సరము ఆలస్యమయినది అప్పుడే దేవుడు, దేవుని జ్ఞానముమీద ఎక్కువ ఆసక్తి కల్గినది. తర్వాత ఇంటర్ అయిపోయిన తర్వాత కొంత కాలమునకు భగవద్గీతను తెచ్చుకొని చదవాలనుకొన్నాను. అయితే ఆదిలోనే హంసపాదు అన్నట్లు మా ఇంటికి వచ్చిన బ్రాహ్మణుడు భగవద్గీతను ఇంటిలో పెట్టుకొంటే మంచిదికాదు దానిని గుడిలో అయినా పెట్టాలి లేకపోతే దేవునిమూల పెట్టి పూజించాలిగానీ, చదువకూడదనీ, చదివితే పోట్లాటలు వస్తాయనీ, సంసారము క్షీణించి పోతుందనీ చెప్పాడు. ఆయన మాటలను విన్న మా ఇంటిలోనివారు నేను భగవద్గీతను చదువకూడదని చెప్పి, భగవద్గీతను బ్రాహ్మణునికే దానమిచ్చారు. తర్వాత ఇంకొక భగవద్గీతను దొంగగా తెచ్చుకొని, ఎవరికీ తెలియకుండా చదివేవాడిని. అయితే అందులోని విషయములు ఏవీ సరిగా అర్థము కాలేదు. ఎక్కడికి పోయి అడగాలను కొన్నా అడిగేదానికి అవకాశమే ఇచ్చేవారు కాదు. ఎక్కడయినా అవకాశము దొరికితే అడిగిన దానికి సరియైన సమాధానము ఇవ్వకుండా దాటవేసే వారు. గీతను చదివితే ఎన్నో సంశయములు వచ్చాయి. అయితే ఒక దానికి కూడా బయట గురువులవద్ద జవాబు దొరకలేదు. జవాబు దొరకక పోగా ఇలా ప్రశ్నించకూడదని మందలించేవారు. అప్పుడు నాకున్న సంశయమును అడగడము తప్పా! యని ఘర్షణపడడము కూడా జరిగినది. ఎక్కడకు పోయినా నీవు హరిజనుడివి, అంటరానివానివి దూరముగావుండు అని అనెడివారు. చివరకు ఒక గురువు నీవు సేవచేసుకుంటూ వుండవల సినదే జ్ఞానమునకు అర్హుడవు కావు అన్నాడు. అంతటితో హిందూ మతములో నాకు జ్ఞానము తెలియదు అని నిశ్చయానికి వచ్చాను. అప్పటి నుండి హిందూమతము మీద ఏవగింపు మొదలయినది.

అప్పటినుండి హిందూ గురువులవద్దకు పోవడము మానివేశాను. క్రైస్తవ సభలలో చెప్పు క్రైస్తవ బోధలు వినుటకు పోయేవాడిని. క్రైస్తవ గురువులవద్దయినా జ్ఞానము లభించుతుందేమోనను ఆశతో అక్కడికి పోయాను. నేను ఐదు సభలకు హాజరయినాను అందులో పెద్దగా జరిగిన రెండు సభలలో వారు చెప్పే బోధలు విన్నాను. మిగతా మూడుచోట్ల హిందువులలో విశ్వహిందూ పరిషత్‌వారు వచ్చి సభ జరుగకుండా గలాటా చేసిపోయారు. అక్కడకు పోయిన వారందరినీ తరిమివేశారు. కాకినాడవద్ద ఒక పాస్టరుగారు బైబిలు జ్ఞానమును బాగా చెప్పుతాడని విని అక్కడకు పోయి తెలుసుకోవాలనుకొన్నాను. ఒక దినము అలాగే పోయాను. కాకినాడలో కూడా హిందువులు వచ్చి పూర్తి మతద్వేషమును ప్రదర్శించి నీవు చర్చి బయట బోధలు చెప్పితే చంపివేస్తాము అని బెదిరించి పోయారు. దానితో ఆ బోధకుడు చర్చికే పరిమితమయిపోయాడు. ఆ దినము ప్రత్యక్షముగా నా ముందరే పాస్టరుగారిని నిందించిన తీరును, అలాగే అక్కడికి పోయిన మమ్ములను తిట్టిన తిట్లను చూచి హిందువులలోని వారు పూర్తి రాక్షసులుగా కనిపించారు. ఇటువంటి ఇంత నీచమైనవారున్న మతములో నేనున్నానా!యనిపించింది. వెంటనే హిందూమతము వదలి బయటికి వచ్చి నేను హిందువును కాదు అని అనిపించుకోవాలనుకొన్నాను. అప్పుడు క్రైస్తవుల గురువులు పెద్దగా పరిచయము లేకపోవడము వలన, క్రైస్తవములోనికి పోతే హిందువుల అవరోధములు ఎక్కువున్నాయని అనిపించుట వలన, ముస్లీమ్‌ల జోలికి ఎవరూ పోరని తలచి, అందులో ఎంతో క్రమశిక్షణా భక్తియున్నదని తలచి, ఆలస్యము చేయకుండా ముస్లీమ్ పెద్దలతో మాట్లాడి నేను ముస్లీమ్‌గా మారిపోవడము జరిగినది. ముస్లీమ్

మతములో చేరి గడ్డము పెంచి పూర్తిస్థాయి ముస్లీమ్‌గా మారిపోయాను. అక్కడ ఎక్కువ క్రమశిక్షణ భక్తియుండుట వాస్తవమేగానీ నాకు అక్కడ జ్ఞానము ఏమీ తెలియలేదు. దేవుని ప్రార్థన తప్ప ఏమీ అర్థము కాలేదు.

అక్కడ “ఏకేశ్వరోపాసన” ప్రార్థన తప్ప ఏమీ అర్థమయ్యేది కాదు. ఖుర్‌ఆన్ గ్రంథమును చదివితే ఏమాత్రము అర్థముకాలేదు. అక్కడి పెద్దలను అడిగితే ఖుర్‌ఆన్‌కంటే ముందు హదీసులు చదువమన్నారు. హదీసులు చదివిన తర్వాత ఖుర్‌ఆన్ చదువవలెనని చెప్పడమేకాక ఖుర్‌ఆన్ చదవక పోయినా ఫరవాలేదు, హదీసులు చదివితీరాలని చెప్పారు. ఖుర్‌ఆన్ ఆడవారు తప్పక చదవాలనీ, హదీసులు మగవారు చదవాలనీ చెప్పారు. వారిమాట ప్రకారమే హదీసులు చదివాను. అది మతానికి సంబంధించినదే గానీ, దేవునికి సంబంధించినదికాదని తెలిసింది. ఖుర్‌ఆన్ విషయానికి వస్తే ఖుర్‌ఆన్ ఎంత చదివినా, అందులో దైవజ్ఞానమున్నదని తెలిసింది గానీ అదేదో అర్థముకాలేదు. నా సాటివారిని అడిగితే వారికంటే నేనే మేలనిపించింది. కొంతమంది పెద్దలను వెదకి వారి ద్వారా ఖుర్‌ఆన్‌లోని విషయాన్ని తెలుసుకోవాలనుకొంటే వారు చెప్పు జ్ఞానముతో నేను ద్వంద్వములో పడిపోయాను. రెండిటిలో నుండి ఏకములోనికి రాలేక పోయాను. **“దేవుడు ఏమీ చేయడు, ఆయన దేనినయినా అయిపో అంటే అయిపోతుందని”** ఒకచోట చెప్పుతారు. తర్వాత మరొక సందర్భములో **“దేవుడు ప్రపంచమును ఆరు రోజులు శ్రమపడి సృష్టించాడనీ, ఏడవ రోజు దేవుడు సింహాసనమెక్కి విశ్రాంతి తీసుకొన్నాడని”** అన్నారు. అప్పుడు దేవుడు పని చేస్తాడా? చేయడా? అని అడిగితే ఆ పెద్దలు కూడా ఎటూ తేల్చి చెప్పలేకపోవుచున్నారు.

అప్పుడు నాకు బాగా అర్థమయినదేమంటే, ఇదే మతములో పుట్టి పెరిగిన పెద్దలకే ఏమీ తెలియకపోతే, నిన్నకాక మొన్న వచ్చిన నాకేమి తెలుస్తుంది! అని అర్థమయినది. ముస్లీమ్ మతములో కూడా నాకు ఏమీ అర్థము కాకపోగా, నేను ఎప్పుడు జ్ఞానమును తెలుసు కొంటానను తపన ఒకప్రక్క ఎక్కువకాగా, ఇక జ్ఞానము తెలియదేమోనను బాధ ఒకప్రక్క పీడించసాగింది. ఈ అంసతృప్తి మధ్య ఆ మతములో ఉండలేక చివరికి క్రైస్తవమతమే దిక్కని తలచి కొంతకాలమునకు క్రైస్తవ మతములోనికి రావడము జరిగినది.

క్రైస్తవమతములోనికి రాకముందే నాకు జ్ఞానము కావాలని అడిగి, తప్పని సరిగా తెలియజేస్తామని వారు చెప్పిన తర్వాతే ఇందులోనికి రావడము జరిగినది. నేను ఇప్పుడు ఒక బోధకునిగా యున్నాను. సృష్ఠికర్త అయిన దేవున్ని గురించి నేను ఎక్కువగా బోధిస్తుంటాను. కావున నన్ను అందరూ క్రియేటర్ ప్రేమ్‌కుమార్ అంటుంటారు. నేను ఇతరుల దృష్ఠిలో పాస్టర్‌గా, బోధకునిగాయున్నా బైబిలులోనిది చెప్పడము తప్ప ప్రత్యేకించి నాకేమి తెలిసింది! అను ప్రశ్న నాలో వెంటాడుచూనేయున్నది. ఒకచోట **'తండ్రి అయిన దేవుడు'** అని చెప్పిన తర్వాత మరొకచోట **'పరిశుద్ధాత్మయే దేవుడని'** చెప్పవలసి వస్తున్నది. ఇక్కడ **'దేవుడు తండ్రియా లేక పరిశు ద్ధాత్మా'** అను ప్రశ్న మిగిలిపోతున్నది. ఈ ప్రశ్న నాకేకాదు క్రైస్తవ మతములోయున్న పెద్ద బోధకులకు కూడా కలదు. వారే ఎటూ తేల్చుకోక తికమకపడుచున్నారు. ఈ విధముగా ఎక్కడపోయినా అసంపూర్ణ జ్ఞానమే కనిపిస్తున్నది. ఇప్పుడు కాకపోతే ఎప్పుడో ఒకప్పుడు తెలుస్తుందిలేయని చేయునది లేక అట్లే కాలము గడుపుచున్నాను. అయితే నేను ఈ మధ్యకాలములో ఒకచోట బోధ చెప్పుచుంటే కొందరు హిందువులు మేము

భజరంగదళ్ కార్యకర్తలమని చెప్పి నేను క్రైస్తవ బోధ చెప్పుచున్నందుకు నన్ను తన్నిపోయారు. తర్వాత ఆ ఊరిలోనికి వస్తే చంపుతామని బెదిరించారు. క్రైస్తవమును బోధించుట వలన హిందువులందరూ క్రైస్తవులుగా మారిపోవుచున్నారని వారు వారి మతమును రక్షించుకొనుటకు బోధకుడైన నన్ను కొట్టిపోయారు. అంతకు ముందే మరొకచోట ముస్లీమ్‌లు వారిమతమునుండి బయటికి వచ్చానను కోపమును లోపలపెట్టుకొని నా బోధను ఆటంకపరచి జీహాద్ అని పేరు చెప్పి కొట్టిపోయారు. దేవుని విషయములో మాకు విరుద్ధముగాయున్న వారిని చంపివేస్తామని చెప్పి పోయారు. ఇటువంటి దాడులు జరుగుచున్నాయని మా మతపెద్దలకు చెప్పితే దేవుని మార్గము ఇరుకుగానే యుంటుంది. ఓర్చుకోవాలని చెప్పి సరిచేయుచున్నారు. నేను హిందువునిగా యుండి ముస్లీమ్ కావడమూ, ముస్లీమ్‌గాయుంటూ క్రైస్తవునిగా మారడము వలన ముస్లీమ్‌లేమో జీహాద్ అని పేరు చెప్పికొడుతున్నారు. హిందువులేమో జీహాద్‌యను పేరు చెప్పకుండానే కొడుతున్నారు. ఇప్పుడు నేను రెండిటికీ చెడిన రేవడినయి నాను. ఒకప్రక్క నాకు దేవుని విషయములో ఎన్నో ప్రశ్నలు మిగిలిపోగా వాటికి ఇంతవరకు జవాబులు దొరకలేదు. ఎప్పుడో ఒకప్పుడు తెలుస్తుందిలే అనుకొని బ్రతుకుతుంటే ఒకప్రక్క పవిత్రయుద్ధమని ముస్లీమ్‌లు, మరొకప్రక్క మతరక్షణయని హిందువులు నన్ను బాధించడము మొదలుపెట్టారు. నేను ఏమీ ఆలోచించలేని స్థితిలో మీవద్దకు వచ్చి ఉన్నది ఉన్నట్లు చెప్పాను. మీ బుద్ధికి తోచిన సలహా చెప్పుతారని అడుగుచున్నాను.

**నేను :-** నీవు మతమును మారినందుకు హిందువులతోనూ, ముస్లీమ్‌ల తోనూ ఇబ్బందిపడుచున్నావు. మేము మతము మారకున్నా, హిందూ

మతములోనే గురువుగాయుంటూ, పెద్ద జ్ఞానము చెప్పుచుండినప్పటికీ, మమ్ములను కూడా వదలక పరమతమును బోధిస్తున్నారని ఆరోపిస్తూ ఇబ్బంది పెట్టుచున్నారు. అదంతయూ మనుషుల అజ్ఞానము, ఎక్కడున్నా జరుగవలసినది యున్నప్పుడు జరుగకమానదు. దానికొరకు నీవు చింతించ వలసిన అవసరము లేదు. నీకు సమాధానముతో కూడుకొన్న జ్ఞానము దొరకలేదని నీవు చింతించవలెను.

**ప్రేమ్ :-** ప్రపంచములో మనుషులు బాధించు బాధకంటే నాకు సరియైన జ్ఞానము దొరకలేదనియే ఎక్కువ బాధగాయున్నది.

**నేను :-** కావాలని శ్రద్ధయున్నవానికి దేవుడు తప్పక జ్ఞానమును అందిస్తాడు.

**ప్రేమ్ :-** ఇంతవరకు దొరకలేదు కదా!

**నేను :-** దేనికయినా సమయము రావాలి కదా! ఏది ఎప్పుడు ఎవరికివ్వాలను విషయము దేవునికి బాగా తెలుసు. ప్రతి ప్రశ్నకు జవాబు ఇచ్చువాడు తప్పక దొరుకుతాడు.

(మేము మాట్లాడుచుండగా అక్కడికి ప్రేమ్‌కుమార్‌కు తెలిసిన పరిచయమున్న ముస్లీమ్ స్నేహితుడు రావడము జరిగినది. వచ్చిన ముస్లీమ్ ప్రేమ్‌కుమార్ స్నేహితుడయిన దానివలన ప్రేమ్‌కుమారే అతనిని నాకు పరిచయము చేశాడు. వచ్చిన ముస్లీమ్ యువకుడు కూడా తనవలె జ్ఞానము కొరకు అన్వేషణ చేయుచున్నాడని చెప్పాడు. అప్పుడు ముస్లీమ్ యువకుడు నన్ను జ్ఞానమునకు సంబంధించిన కొన్ని ప్రశ్నలడగడము జరిగినది. ఆ విషయమును ఇక్కడ పొందుపరుస్తున్నాము చూడండి.)

**ముస్లీమ్ యువకుడు :-** స్వామిగారు! మీరు వ్రాసిన గ్రంథములను నేను

ఇతరుల వద్దయుండగా చూచి కొన్ని గ్రంథములను చదివినాను. అందులో కొన్ని ప్రశ్నలకు నాకు వివరము తెలియలేదు. మీరు చెప్పినది కొంతవరకు అర్థమయినది. అయినా కొంత అనుమానమున్నది. ఇప్పుడు వాటిని అడుగవచ్చునంటే అడుగగలను.

**నేను :-** నేను వ్రాసిన దానికి నన్ను అడుగకపోతే ఎవరినడుగుతావు. ఫరవాలేదు ధైర్యముగా అడుగు.

**ముస్లీమ్ :-** స్వామీ! మీరు "ప్రథమ దైవగ్రంథము భగవద్గీత" యని అన్నారు. ఇంతవరకు హిందువుల గురువులు ఎవరుగానీ భగవద్గీతను ప్రథమ దైవగ్రంథమని చెప్పలేదు. అటువంటిది వారినందరినీ అతిక్రమించి మీరు చెప్పినందుకు సంతోషము. అయితే మీరు ఏ ఆధారముతో భగవద్గీతను ప్రథమ దైవగ్రంథమన్నారు?

**నేను :-** దానికి జవాబు భగవద్గీతలోనే కలదు. భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయములో మొదటి శ్లోకములోనే కృష్ణుడు అర్జునునితో చెప్పుచూ సృష్ఠి ఆదిలో నేను సూర్యునికి చెప్పిన జ్ఞానమునే ఇప్పుడు నేను నీకు చెప్పు చున్నానని చెప్పాడు. అప్పుడు అర్జునుడు నీవు పుట్టినది ఇప్పుడు కదా! సూర్యుడు పుట్టినది సృష్ట్యాదిలో కదా! నీవు సూర్యునికి జ్ఞానము ఎట్లు చెప్పావని అడిగాడు. దీనినిబట్టి ద్వాపరయుగములో చెప్పబడిన భగవద్గీత సృష్ట్యాదిలోనే చెప్పబడినదని తెలియుచున్నది. అందువలన భగవద్గీత ప్రథమ దైవ జ్ఞానముగలదని దానిని ప్రథమ దైవగ్రంథము అంటున్నాము. ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథమనుటకు ఖుర్ఆన్‌లోనే ఆధారమున్నట్లు, భగవద్గీత ప్రథమ దైవగ్రంథమనుటకు భగవద్గీతలోనే ఆధారము గలదు.

**ముస్లీమ్ :-** ఖుర్ఆన్ గ్రంథము భగవద్గీతను ధృవీకరించుచున్నదని అన్నారు కదా! ధృవీకరించుట అంటే ఏమిటి?

**నేను :-** దృఢపరచుట అన్నాగానీ, ధృవీకరించుట అన్నాగానీ రెండూ ఒకే అర్థమునిచ్చుచున్నవి. ధృవీకరించడము అనినా, సాక్ష్యము చెప్పుట అను దానితో సమానమగును. భగవద్గీత మిగతా గ్రంథములకు ఆధారమనీ, చివరకు ఖుర్ఆన్ గ్రంథమునకు కూడా ఆధారమని ఖుర్ఆన్ గ్రంథములోనే చాలామార్లు చెప్పియున్నారు. ఇది వాస్తవమే అని నిర్ధారించడమును ధృవీకరించినట్లు అగుచున్నది. కులధృవ పత్రము అని ఉందనుకొనుము. అప్పుడు ఇతనిది ఫలానా కులమని నిర్ధారించుచూ సాక్ష్యము నిచ్చు పత్రమును కులధృవపతమ్రు అంటాము. అట్లే భగవద్గీతే అన్నిటికీ మూల గ్రంథమని ఖుర్ఆన్ గ్రంథము ధృవీకరించుచున్నది.

**ముస్లీమ్ :-** ముందువచ్చిన గ్రంథము ఖుర్ఆన్‌కు ఆధారమని ఖుర్ఆన్ గ్రంథములోయున్నదిగానీ, ఫలానా భగవద్గీతయని పేరు చెప్పలేదు కదా! అప్పుడు ముందు వచ్చినది ఏ గ్రంథమని అర్థము చేసుకోవాలి?

**నేను :-** భగవద్గీతలో జ్ఞానయోగములో మొదటి శ్లోకము యొక్క ఆధారము తోనే భగవద్గీత అన్నిటికంటే ముందు వచ్చిన గ్రంథమని తెలియవచ్చును. అంతేకాక భగవద్గీత పుట్టిన ఐదువేల సంవత్సరముల క్రిందట ఏ మతము గానీ, ఏ మత గ్రంథముగానీ లేదు. అటువంటప్పుడు గీత వయస్సును బట్టి అయినా అది మొదటి గ్రంథమని చెప్పవచ్చును.

**ముస్లీమ్ :-** ఖుర్ఆన్ గ్రంథములో ఒకచోట ఇంజీలు గ్రంథము, ఖుర్ఆన్ గ్రంథము వాటికంటే ముందుయున్న తౌరాత్ గ్రంథమును ధృవీకరిస్తున్నవని చెప్పబడినది. అప్పుడు ఒక్క ఖుర్ఆన్ గ్రంథమే కాకుండా ఇంజీలు

(బైబిలు) గ్రంథము కూడా తౌరాత్ గ్రంథము దైవగ్రంథమనీ అదే అన్నిటికంటే ఆధారమని చెప్పడము జరిగినది. బైబిలు కూడా తౌరాత్‌ను ధృవీకరిస్తున్నది. అలాంటప్పుడు తౌరాత్ గ్రంథము ఒకటున్నదని తెలియుచున్నది. ఆ తౌరాత్ గ్రంథమే భగవద్గీతయని ఎక్కడయినా చెప్పబడినదా? తౌరాత్ అనునది భగవద్గీతయని మీరు మాత్రమే చెప్పారు. అంతకుముందు ఎవరూ చెప్పలేదు కదా!

**నేను :-** అవును! తౌరాత్ గ్రంథము భగవద్గీతయని ఎవరూ చెప్పలేదు. ఎవరూ చెప్పలేదు కాబట్టి నేను చెప్పాను. బైబిలుకంటే ముందుయున్న గ్రంథము భగవద్గీత. అందువలన తౌరాత్ గ్రంథమే భగవద్గీతయని చెప్పాము.

**ముస్లీమ్ :-** మీరు చెప్పినంతమాత్రమున మేము నమ్మాలా? అనువారు కూడా కొందరుండవచ్చును కదా! వారికి మీరు ఏమని సమాధానము చెప్తారు?

**నేను :-** వారిని నేను నమ్మమని చెప్పలేదు కదా! నామాట కొరకు ఎదురు చూసేవాళ్ళకు మాత్రమే నేను చెప్పాను, అందరికీ కాదు.

**ముస్లీమ్ :-** కొందిరికయినా మీరు ఏ ఆధారముతో చెప్పారు?

**నేను :-** నేను చెప్పిన దానికి ఆధారముండదు. నేను చెప్పిన తర్వాత నామాట ఇతరులకు ఆధారమవుతుంది. నేను ఒకమాటను అడుగుతాను నేను చెప్పినమాటను కాదనుటకు ఎవరివద్దయినా ఆధారమున్నదా? అని అడుగుచున్నాను. నా మాటను కాదనుటకు ఎవరివద్దా ఏ ఆధారమూ ఉండదు. అంత ఎందుకు! తౌరాత్ గ్రంథము ఏదయినదీ మీకు తెలియదు కదా! అటువంటప్పుడు నేను చెప్పిన మాటను వినేదానికి మీకేమి బాధయని

అడుగుచున్నాను. మీకు సరిపోకపోతే నామాటను విశ్వసించవద్దని తెలుపు చున్నాను.

**ముస్లీమ్ :-** ఈ కాలములో ప్రతి దానికీ ఆధారము కావాలని అడుగు వారున్నారు. వారికి ఆధారమును చూపితేగానీ నమ్మరు.

**నేను :-** ఆధారమున్న ప్రతిదీ సత్యముకాదు. ఆధారములేని ప్రతిదీ అసత్యము కాదు. ఖుర్ఆన్ గ్రంథమున్నది కదా! అందులోని మాటలను మేము ఎందుకు నమ్మాలి? అందులో చెప్పిన మాటలన్నీ నిజమనుటకు ఏమయినా ఆధారమున్నదా? అని ఏ ముస్లీమ్ ప్రశ్నించలేదు కదా! ప్రతి దానికి ఆధారము కావాలని అడుగువారు ఖుర్ఆన్ విషయములో ముస్లీమ్‌లు ఆధారమును ఎందుకు అడుగలేదు? అట్లే భగవద్గీత విషయములో హిందువులు ఆధారమును ఎందుకు అడుగలేదు? అక్కడ ఆధారములు అడుగనివారు తౌరాత్ గ్రంథ విషయములో ఎందుకు ఆధారమును అడుగు చున్నారు? నేను ఒక ప్రశ్నను అడుగుతాను, ఆ ప్రశ్నను తీసుకొని ప్రతి దానికీ ఆధారము కావాలని అడుగువారి వద్దకు పోయి ప్రశ్నించి చూడు ఏమి చెప్పుతారో తెలుస్తుంది. **పవిత్ర ఖుర్ఆన్ గ్రంథములో 43వ సూరా, 4వ ఆయత్‌నందు** ఇలా కలదు. **“నిశ్చయముగా ఇది (ఖుర్ఆన్ గ్రంథము) మాతృగ్రంథములోయున్నది. ఇది మావద్ద ఎంతో పవిత్రమైనది, వివేకముతో నిండియున్న గ్రంథముగా ఉన్నది”** ఈ వాక్యము ఖుర్ఆన్ గ్రంథమును ఉద్దేశించి చెప్పినది. ఖుర్ఆన్ గ్రంథమునకు మాతృ గ్రంథము ఏదో ఎవరయినా సరియైన సమాధానము చెప్పగలరా? ఇంత వరకూ ముస్లీమ్ లందరూ మాతృగ్రంథముగా (ఉమ్ముల్ కితాబ్‌గా) చెప్పుకొనుచున్న గ్రంథము సత్యమేనా? **85వ సూరా 22వ ఆయత్‌లో** చెప్పిన ఉమ్ముల్ కితాబ్ లేక

మాతృగ్రంథము సురక్షితమైన ఫలకము మీద వ్రాయబడిన **"లౌహేముహ్ ఫూజ్"** అనబడు గ్రంథమేనా? అంటే మొదట వ్రాయబడినట్లే యదార్థస్థితిలో యున్న మూలగ్రంథమా? ఇది నా ప్రశ్న మాత్రమే. ఒకవేళ మీరు చెప్పునదే సత్యమైన మాతృగ్రంథము అనేదానికి ఆధారము ఏమయినా కలదా? మాతృగ్రంథమంటే అదేనా? ఇంకా ఏమయినా అదేననుటకు పూర్తి సాక్ష్యము కలదా?

**ముస్లీమ్ :-** మీరు జీహాద్ లేక పవిత్రయుద్ధమును గురించి చెప్పుచూ ఆ పేరుగానీ, ఆ మాటగానీ ఖుర్‌ఆన్ గ్రంథములో లేదన్నారు కదా! అయితే **2వ సూరా,216వ ఆయత్‌లో "మీకు నచ్చనిదైనా, అసహ్యాకరమైనా యుద్ధము చేయడము మీకు విధిగా నిర్ణయించబడినది. మీకు నచ్చని విషయమే మీకు మేలయినది కావచ్చు మరియు మీకు నచ్చే విషయమే మీకు హానికరమైనది కావచ్చు. కానీ అల్లాకు అంతా తెలుసు. మీకు ఏమీ తెలియదు"** అని కలదు. దీనిని గురించి మీరేమంటారు?

**నేను :-** ఇక్కడ చెప్పినది మనుషులను చంపుకొనే యుద్ధము కాదు. దైవ మార్గములో శ్రమపడడమును మనిషి జీవితములో యుద్ధముగా యున్నదని వర్ణించి చెప్పారు. దైవమార్గములో పోరాటమువలె జీవితమును సాగించడమును ధర్మయుద్ధము అంటాము. ధర్మముచేత అధర్మములను నాశనము చేయడమును ధర్మయుద్ధము అనవచ్చును. ధర్మయుద్ధములో నష్టమురావచ్చును, బంధువులు దూరము కావచ్చును, ఉన్న సంపద పోవచ్చును, ఆస్తులు పోవచ్చును, భార్యపిల్లలు పోవచ్చును. అందువలన ధర్మయుద్ధము అందరికీ నచ్చనిపనిగాయున్నది. అయినా ఉన్నవన్నీ పోయినా అన్నిటికంటే మించినది మనకు లభించవచ్చును. పై వాక్యములో కూడా

మీకు నచ్చని విషయమే మీకు మేలయినది కావచ్చును అని చెప్పారు. **9వ సూరా 24వ ఆయత్‌లో** ఇలా కలదు **"మీ తండ్రి తాతలు, మీ కుమారులు, మీ సోదరులు, మీ స్నేహితులు, మీ బంధువులు, మీరు సంపాదించిన ఆస్తిపాస్తులు, మీ వ్యాపారాలు, మీ ప్రీతికరమైన భవనములు అల్లాహ్‌కంటే, అల్లామార్గములో పోరాటముకంటే మీకు ఎక్కువ ప్రియమైన వైతే అల్లాహ్ మీకు సన్మార్గమును చూపడు."** అని ఉన్నది కదా! ఇక్కడ దేవుని విషయములో ప్రాకులాడడమును పోరాటము అని చెప్పుచున్నారు. దేవుని మార్గములో పోరాటము అంటే దేవుని కొరకు చేయు పనులన్నియూ పోరాటమనియే చెప్పవచ్చును. అదే విధముగా దేవుని మార్గములోని నమాజ్, జకాత్ చేయుటలో అయిష్టత ఏర్పడును. అప్పుడు మనిషి తనలోని గుణములతో ఘర్షణ పడవలసివచ్చును. దానినే ఇక్కడ యుద్ధమన్నారు.

**ముస్లీమ్ :-** యుద్ధము అంటే ఆయుధములతో చేసేదనీ, పవిత్రయుద్ధము అంటే దేవుని కొరకు చేయునదనీ, అవిశ్వాసులను చంపేది అనీ మా పెద్దలు చెప్పగా విన్నాను. మీరేమో వేరు విధముగా చెప్పుచున్నారు.

**నేను :-** నీకు బాగా అర్థము కావాలంటే ఇంకా వివరముగా చెప్పుతాను చూడు. కత్తులతో లేక బాంబులతో మనుషులను చంపుదానిని అపవిత్ర యుద్ధము అని అనవచ్చును. అలా చంపునది తనమేలు కొరకేగానీ దేవుని మేలు కొరకు కాదు. బయటిక్రియల వలన, బయటయుద్ధముల వలన దేవుడు తెలియబడడు, దేవుడు తెలియాలంటే దేవునికొరకు శరీరములోపల గల గుణములచే ఎంతో ప్రతిఘటన చేయవలసియున్నది. శరీరములోని గుణములే మనిషిని వక్రమార్గమును పట్టించి దేవునికి దూరము చేయుచున్నవి. శరీరములోని తలయందుగల గుణములే సైతాన్ రూపములో

యున్నవి. సైతాన్ అనగా ఆధ్యాత్మికరంగములో మాయ అంటున్నాము. మాయలోని భాగములే మనిషిలోని ఆరు గుణములు. వీటినే మనిషికి శత్రువర్గము అని చెప్పవచ్చును. శత్రువర్గము అంటే శత్రువుల గుంపు అని అర్థము. ఈ ఆరు గుణములు మనిషికి భీకరమైన శత్రువులుగా యున్నాయి. మనిషి బయట శత్రువులతో పోరాడితే బయటయుద్ధము అవుతుంది. లోపలి శత్రువులయిన ఆరుగురితో పోరాడితే లోపలి యుద్ధము అవుతుంది.

| బయటి యుద్ధము | లోపలి యుద్ధము |
|---|---|
| 1) బయటియుద్ధము రక్తపాతముతో కూడుకొనియుంటుంది. | 1) లోపలియుద్ధము రక్తపాత రహితముగా ఉంటుంది. |
| 2) బయట ఒక శత్రువును చంపినా చచ్చిన వానిని గురించి ఏడ్చేవారుంటారు. | 2) లోపల ఆరుమందిని చంపినా ఏడ్చేవారు ఎవరూ లేరు. |
| 3) బయట శత్రువులను చంపితే దేవుడు తెలియబడక పోవడమే కాక పెద్దమొత్తములో పాపము మాత్రము వస్తుంది. బయట శత్రువును చంపితే పోలీస్ కేసులుంటాయి, న్యాయ స్థానములో శిక్షయుంటుంది. | 3) లోపల శత్రువును ఒక్కరిని చంపినా, ఆరుమందిని చంపినా కేసులూవుండవు, శిక్షలూ వుండవు. ఏమాత్రము పాపము రాదు. |

| | |
|---|---|
| 4) బయట శత్రువులను చంపడము వలన దేవుడు దూరమగును. | 4) లోపల గుణ శత్రువులను చంపడము వలన దేవునికి దగ్గరగుటకు అవకాశముగలదు. |
| 5) బయట శత్రువులను చంపుట వలన నరకప్రాప్తి తప్పదు. | 5) లోపలి శత్రువులను చంపుట వలన మోక్షము లభించును. |
| 6) బయట శత్రువులను చంపుట వలన బయట ఆస్తులు రావచ్చును. | 6) లోపలి గుణ శత్రువులను చంపుట వలన బయట ఆస్తులు పోవచ్చును. |
| 7) బయటయుద్ధముతో బయటి రక్తపాతముతో ఇతరుల ఆస్తిని దక్కించుకోవచ్చును. | 7) లోపలి యుద్ధము వలన బయట ఆస్తులు ఉన్నవి కూడా పోవచ్చును. దగ్గర బంధువులు దూరము కావచ్చును. |
| 8) బయట ఏ శత్రువును చంపినా అది బాహ్యాయుద్ధము క్రిందికి వచ్చును. | 8) లోపల ఏ గుణమును లేకుండా చేసుకొనినా అది అంతరయుద్ధమగును. అంతరయుద్ధములో మనిషి గుణములను శత్రువులను జయించితే బయట ఏ లాభమురాదు. |

| | |
|---|---|
| 9) బయట జరుగు యుద్ధము ఆయుధములచేత చేయబడునదిగా ఉన్నది. ఆయుధముల చేత చేయు విచ్ఛిన్నము (యుద్ధము)లో ఆయుష్షు హరించు మరణములు జరుగును. | 9) లోపలి యుద్ధము వలన జనన మరణములు లేని మోక్షము లభించును. |
| 10) బయట జరుగు యుద్ధమునకు అజ్ఞానుల ఆశీస్సులు, అజ్ఞానుల సలహాలు, అజ్ఞానుల ప్రేరణయుండును. | 10) లోపల జరుగు యుద్ధమునకు జ్ఞానుల యొక్క సలహాలు, జ్ఞానులయొక్క ఆశీస్సులు, జ్ఞానులయొక్క ప్రేరణ ఉండును. |
| 11) బయట యుద్ధమును అజ్ఞానులు సహితము చేయగలరు. | 11) లోపలి యుద్ధమును జ్ఞానులు మాత్రమే చేయగలరు. |
| 12) బయట యుద్ధమునకు కండబలమూ, శరీర బలమూ అవసరము. | 12) లోపలియుద్ధమునకు కండబలము, శరీర బలము అవసరము లేదు. జ్ఞానబలముతో చేయవచ్చును. |
| 13) బయట యుద్ధము చేయటకు తర్ఫీదు (ట్రయినింగ్) అవసరము | 13) లోపలియుద్ధమునకు ట్రయినింగ్ (తర్ఫీదు) అవసరము లేదు. |

| | |
|---|---|
| 14) బయట యుద్ధమునకు శరీర కవచములు, మందమైన దుస్తులు అవసరము. | 14) లోపలియుద్ధమునకు కవచములు, మందము గుడ్డలు అవసరము లేదు. చిన్న గోసి పెట్టుకొని అయినా యుద్ధము చేయవచ్చును. |
| 15) బయటయుద్ధములో సైన్యము అవసరము. | 15) లోపలి యుద్ధమునకు సైన్యము అవసరము లేదు. |
| 16) బయటి యుద్ధము అజ్ఞానముతో చేయవచ్చును. | 16) లోపలియుద్ధము జ్ఞానముతో చేయవలెను. |

యుద్ధము అంటే ఆయుధముల చేత చేయునదే అని అనుకో కూడదు. యుద్ధము రెండు రకములుగా యున్నది.

ఇక్కడ ముఖ్యముగా తెలియవలసినదేమంటే, ఖుర్ఆన్‌లో యుద్ధము అను పదమును వాడినా, అది దేవునిమార్గములో యుద్ధమేగానీ, ప్రపంచ మార్గములోని బయటి యుద్ధముకాదని తెలియవలెను. అట్లుకాకుండా దుప్పటి అంటే కప్పుకుండేదియనీ, కత్తి అంటే పొడిచేది అనీ అనుకోకూడదు. దుప్పటి అంటే కప్పుకొనేదే కాకుండా పరుచుకొనే దానికి కూడా పనికి వస్తుంది. అలాగే కత్తి అంటే పొడిచేదేకాదు కాయగూరలను తరుగునదని కూడా అని అర్థము చేసుకోవాలి. అట్లే యుద్ధము అంటూనే మనుషులను చంపేదే కాదు, మనుషులను ఎల్లకాలము చనిపోకుండా మోక్షములో ఉంచునదని కూడా తెలియవచ్చును.

ఇదంతా గమనించిన తర్వాత జీహాద్‌యనీ, పవిత్రయుద్ధమనీ పేరు పెట్టుకొని, దానిని దైవగ్రంథములకు జోడించి పెట్టడము వలన దైవ గ్రంథములకు కూడా మర్యాద లేకుండా చేసినట్లగుచున్నది. అందువలన ఖుర్‌ఆన్ గ్రంథములో **జీహాద్** అనే పదమే లేదని చెప్పాము. ఖుర్‌ఆన్ గ్రంథములో అక్కడక్కడ దేవుని మార్గములో పోరాటమని, దేవుని మార్గములో ధర్మయుద్ధమని యున్నదిగానీ, జీహాద్ అనే పదమే లేదు. దైవగ్రంథమయిన ఖుర్‌ఆన్ గ్రంథములో లేని పదమును పట్టుకొని మతములో ముఖ్యమైన కార్యముగా దానిని గురించి చెప్పుకోవలసిన అవసరమేముంది? దేవుడు తన గ్రంథములలో చెప్పని దానిని గురించి మాట్లాడుకోవడము, ముఖ్యముగా చేయడము, దేవునికి ఇష్టము లేని పనియగును. దేవునికి ఇష్టము లేని బయట యుద్ధమును, మనుషులను చంపుకార్యమును పవిత్రయుద్ధము అని అనకూడదు.

**ముస్లీమ్ :–** మీరు చెప్పునదంతా సత్యమే అనిపించినా, ఒకవైపు నాలో కొంత అనుమానము పీడిస్తూనేయున్నది. ఖుర్‌ఆన్ గ్రంథములో బాహ్య యుద్ధమును గురించే చెప్పారని మేము నమ్మునట్లు **మూడవ సూరా (3) 140వ ఆయత్‌నందు** కలదని అనుకొంటున్నాను. ఆ వాక్యములో ఉన్నది జీహాద్‌యేనని మా పెద్దలందరూ చెప్పుచున్నారు. దీనికి మీరేమంటారు?

**నేను :–** మీరు ఏమి చెప్పినా నేను బయటియుద్ధమును ఒప్పుకోను. నేనే కాదు దేవుడు కూడా ఒప్పుకోడు. అటువంటప్పుడు ఏ పారాలోగానీ, ఏ సూరాలోగానీ, ఏ ఆయత్‌లోగానీ దేవుడు బాహ్యయుద్ధమును గురించి చెప్పియుండడు. సరే! నీవు చెప్పిన **3వ సూరా 140వ ఆయత్‌ను** చూస్తాము

అందులో ఇలా వున్నది. **"ఒకవేళ ఇప్పుడు మీరు గాయపడితే వాస్తవానికి ఆ జాతివారు (మీ విరోధులు) కూడా అదే విధముగా గాయపడ్డారు. మేము ఇలాంటి దినాలను ప్రజలమధ్య త్రిప్పుచూయుంటాము. మరియూ అల్లాహ్ మీలో నిజమైన విశ్వాసులెవరో చూడడానికి మరియు సత్యస్థాపనకు తమ ప్రాణాలను త్యాగము చేయగల వారిని ఎన్నుకోవడానికి ఇలా చేస్తూ వుంటాడు. వాస్తవానికి అల్లాహ్ దుర్మార్గులను ప్రేమించడు"** అని అక్కడ చెప్పడమైనది. ఈ వాక్యములో గాయపడడము, ప్రాణత్యాగము చేయడము అని వుండుటవలన అది నిజముగా బయటియుద్ధమే అని అనుకొనుటకు అవకాశముగలదు. ఇక్కడ ముఖ్యముగా చెప్పుకోవలసిన విషయమొ కటున్నది. అదేమనగా! ఈ వాక్యము చివరిలో **"అల్లాహ్ దుర్మార్గులను ప్రేమించడు"** అని ఉన్నది. బాహ్యయుద్ధము దేవుని లెక్కలో ఇతరులను బాధించు దుర్మార్గమేయగుట వలన దానిని ఖండిస్తూ దేవుడు దుర్మార్గులను ప్రేమించడు అని చెప్పాడు. అంతేకాక ప్రాణత్యాగము యుద్ధములోనే కాదు ఎక్కడయినా జరుగవచ్చును. ఈ వాక్యములో సత్యస్థాపనకై అని అనగా జ్ఞానమును నెలకొల్పుటకు అని అర్థము. సత్యస్థాపనకు ప్రాణాలను సహితము లెక్కచేయని వానిని ఎన్నుకోవడానికి, దేవుడు విశ్వాసులెవరో గుర్తించటానికి, దేవుడు అపాయకర దినములను గాయపడుటకు అవకాశమున్న దినములను, ఒక్కొక్కపుడు దేవుడు సృష్ఠిస్తావుంటాడు. దేవుడు మనుషుల మధ్య కార్యములలోనో, సమస్యలలోనో సృష్ఠించి తికమక పడునట్లు చేసి మనిషిలోని సహనమును పరీక్షించుచుండును. అంతేగానీ అపాయకరమైన దినములను, గాయములను, ప్రాణత్యాగములను దేవుడు సృష్ఠించి మనిషిని భయపెట్టి పరీక్షించడమేగానీ, వాస్తవ యుద్ధము బయట చేయు యుద్ధము అని అనుకోకూడదు.

ఇదే విషయమునే ప్రస్తావించుచూ **47వ సూరా 31వ ఆయత్‌లో** ఇలా చెప్పాడు. **"నిశ్చయముగా మీలో ధర్మయుద్ధము చేసేవారెవరో, మరియు సహనము వహించేవారు ఎవరో చూచేవరకు మేము మిమ్ములను తప్పక పరీక్షిస్తాము. మరియు మేము మీ ప్రజ్ఞావచనాలను కూడా పరీక్షిస్తాము"** అని చెప్పడము జరిగినది. పై వాక్యములోగానీ, క్రింది వాక్యములోగానీ, బాహ్యాయుద్ధమునకు సంబంధించిన విషయమే లేదు. 3వ సూరా 140వ వాక్యములో దేవుడు దుర్మార్గులను ప్రేమించడు అని చెప్పడమును, 47వ సూరా 31వ వాక్యములో మేము మీ ప్రజ్ఞావచనాలను కూడా పరీక్షిస్తాము అని అనడములో, ఇదంతయూ బాహ్యాసంబంధ కార్యము కాదు, అంతరంగమున బుద్ధికి సంబంధించిన విషయమని తెలిసిపోవుచున్నది. క్రింది వాక్యములో స్పష్టముగా ధర్మయుద్ధము చేసేవారెవరో, సహనము వహించే వారెవరో చూచేవరకు మిమ్ములను తప్పక పరీక్షిస్తాము అని చెప్పాడు కదా! పరీక్ష అంటే పేపరు పెన్నుతో వ్రాసేది కాదు. దేవుని పరీక్షలన్నియూ కార్యరూపములో యుండును. ఆ కార్యములు గాయములు తగులువైన కావచ్చును, లేక ప్రాణము పోతుందేమోనను భయము కల్గించునవైనా కావచ్చును. ఉదాహరణకు అటువంటి పరీక్ష కార్యములను ఒక దానిని చెప్పుకొని చూస్తాము.

ఒక భక్తుడు దేవునిసేవ చేయు నిమిత్తము మా ఆశ్రమములో పని చేయుటకు వచ్చాడు. అతడు స్వచ్ఛందముగా సేవ చేయుటకు వచ్చినప్పుడు అతనికి ఒక ప్రమాదము జరిగినది. ఆ ప్రమాదములో వేడినూనె మీద పడడము కాళ్ళు కొంత కాలడము జరిగినది. వడలు

చేయు సమయములో బాగా కాగిన నూనె మీద పడడము చూస్తే చచ్చిపోతారేమో అన్నంత భయమును కల్గించునదిగా ఆ దృశ్యమున్నది. చావు పరిస్థితి రాకున్నా కొంత వరకు గాయములు కావడమూ, తిరిగి కొన్ని రోజులకు నయము కావడము జరిగినది. ఇక్కడ దేవుని సేవ చేయుటకు వచ్చిన వ్యక్తిని పరీక్షించుటకు మేము ఇలాంటి దినములను ప్రజల మధ్య త్రిప్పుచుంటాము అని చెప్పినట్లు దేవుడే పరీక్ష నిమిత్తము అలా చేశాడని పై వాక్యములను బట్టి తెలియుచున్నది. 3వ సూరా 140వ ఆయత్‌లో చెప్పినట్లు కొన్ని చెడు జరుగు దినములను సంఘటనలను తన భక్తుల మీదనే దేవుడు విధించి చూస్తున్నాడని కొంతవరకు అర్థమయి నది. దేవుని సేవలో జ్ఞాన ప్రచారము ముఖ్యమైన సేవగా మేము చెప్పుచుంటాము. అలాంటి జ్ఞానప్రచార సేవలో పాల్గొనుటకు మూడు కిలోమీటర్ల దూరములోయున్న మా ప్రచార వాహనము వద్దకు రావాలని ఒక వైశ్య కుటుంబములోని భార్యాభర్త ఇంటి వద్దనుండి మోటర్‌సైకిల్ మీద బయలుదేరారు. వారిది మంచి ఉద్దేశ్యమే అయినా, వారి సహనమును పరీక్షించుటకు దేవుడు వారి వాహనమునకు అటువంటి వాహనమే కొద్దిగా తగులునట్లు చేసి, భార్యాభర్తలను క్రింద పడునట్లు చేసి కొద్దిగా గాయ పరచడము జరిగినది. ఇదంతయూ పై వాక్యములలో చెప్పినట్లే జరిగినది. అప్పుడు యుద్ధము కాకున్నా గాయములు కావడము జరిగినది కదా! యుద్ధము కాకున్నా ప్రాణాపాయము జరుగునేమో అన్నంత భయము కల్గినది. అప్పుడు గాయపడిన వారి సహనమును దేవుడు చూస్తున్నాడు. అట్లే వారి వివేక వచనలములను కూడా వింటున్నాడు. ఇటువంటి

సంఘటనలను ప్రజల మధ్య త్రిప్పి పరీక్షించుచుండునని పై వాక్యములాగా దేవుడు చెప్పడము జరిగినదని మరువకూడదు. గాయములు, ప్రాణా పాయములు జరుగుటకు బాహ్యాయుద్ధమే అవసరము లేదు. దేవుడు మనిషిని పరీక్షించు నిమిత్తము జరిగిన పనిలో విధానము అట్లున్నదని గ్రహించవచ్చును.

**ముస్లీమ్ :-** దేవుడు అందరికీ అధిపతి, అందరిలోని రహస్యము తెలిసిన వాడు అనియూ భూమిమీద ఆకాశములోని రహస్యములన్నీ దేవునికి తెలుసు అని ఖుర్ఆన్ **2వ సూరాలో 33వ ఆయత్‌నందు** కలదు చూడండి. **"నిశ్చయముగా నేను మాత్రమే భూమ్యాకాశముల అగోచర విషయాలను ఎరుగుదునని మీతో చెప్పలేదా? మరియు మీరు ఏది బహిర్గతము చేస్తారో మరియు ఏది దాస్తారో కూడా నాకు బాగా తెలుసు"** అని కలదు. దీనిని బట్టి దేవునికి అన్నీ తెలుసు. ఏ మనిషిలో ఏమున్నదో ఆయనకు తెలుసు. అటువంటప్పుడు ఏ మనిషిలో ఎంత సహనమున్నదీ, దేవునికి తెలియదా? గాయపెట్టి, భయపెట్టి పరీక్షించనిదే దేవునికి తెలియదా? అన్నీ తెలిసిన దేవుడు మనుషులను ఎందుకు పరీక్షించుచున్నాడు?

**నేను :-** సర్వప్రపంచములో, ఏ మనిషిలో ఏమున్నది, ఏమి చేసినదీ దేవునికి బాగా తెలుసు. అటువంటప్పుడు ఎవరిలో ఎంత సహనమున్నది అను విషయము కూడా దేవునికి బాగా తెలుసు. అయినా దేవుడు మనుషులను పరీక్షకు గురి చేయుచున్నాడు. ఆ పరీక్షలలో ఎవరికీ అర్థముకాని అపాయములను కల్పించి ఎవరు ఎంత భయపడుచున్నదీ, ఎవరు ఏమను కొనుచున్నదీ నమోదు చేయుచున్నాడు. అన్నీ తెలిసి అలా ఎందుకు చేయు

చున్నాడనగా! దైవమార్గములో ఎవనికి ఎంత సహనమున్నదో దేవునికి ముందే తెలుసు. అయితే భక్తుడయిన వానికి తనకు ఎంత సహనమున్నదో తెలియాలంటే పరీక్షయుండవలసిందే, అందువలన పరీక్ష మనిషికే అవసరము, అతని భావము కూడ ఏమున్నదో అతనికి తెలియుటే ముఖ్యము. అందువలన మనుషులకు తన విషయము తనకు తెలియుట కొరకు పరీక్ష అవసరము. అంతేగానీ దేవునికి తెలియకగాదు. సర్వ ప్రపంచములోని మనుజులకు ప్రతి దినము సమస్యల రూపములో పరీక్షలు జరుగుచునేయున్నవి. అందులో కొందరు మాత్రము నెగ్గుతున్నారు. మిగతా అందరూ ఓడిపోవుచున్నారు. ఎవరి ఓటమి వారికి తెలుసు. అయితే అందరి ఓటమి గెలుపులు దేవునికి మాత్రము తెలుసు.

**ముస్లీమ్ :-** "బాహ్యప్రపంచ యుద్ధము దైవమార్గములో లేనేలేదు. ఒకవేళ అది యున్నది అంటే అజ్ఞానమగును." అని మీరు చెప్పుచున్నారు కదా! అట్లయితే గురువులుగా యున్నవారూ, బోధకులుగా యున్నావారూ ఎందరో బాహ్య యుద్ధములను గురించి చెప్పి ప్రజలను తప్పు మార్గములోనికి పంపుచున్నారు. అటువంటి వారికి దేవుని శిక్షయుంటుందా?

**నేను :-** దేవుని జ్ఞానమును వక్రమార్గము పట్టించిన వానికి తప్పని సరిగా శిక్షవుంటుంది. ఈ విషయమును గురించి **2వ సూరా 159వ వాక్యములో** ఇలా కలదు చూడండి. **"నిశ్చయముగా చెప్పుచున్నాను. ఎవరయితే మేము అవతరింపజేసిన స్పష్టమైన బోధలను మార్గదర్శకత్వాలను, ప్రజల కొరకు దివ్యగ్రంథములో స్పష్టపరచిన పిదప కూడా దాచుతారో వారిని అల్లాహ్ తప్పక శిక్షిస్తాడు, శపిస్తాడు, బహిష్కరిస్తాడు మరియు శపించగల**

**వారు కూడా వారిని శపిస్తారు"** అని చెప్పియున్నాడు. దీనినిబట్టి దేవుని జ్ఞానమువద్ద భయములేకుండా పోయినవారికీ, దేవుని జ్ఞానము ఒకటుంటే ఇంకొకటి బోధించువారికీ, లేనిజ్ఞానమును ఉన్నట్లు తానే స్వయముగా కల్పించి చెప్పువానికీ, దైవమార్గములో దైవజ్ఞానములో లేని బాహ్య యుద్ధమును గురించి చెప్పి, అదే జీహాద్‌యని నమ్మించి ప్రజలను జీహాదీలుగా మార్చి, దేవుడు చెప్పని యుద్ధములను, దేవుడు చెప్పని హింసలను రేకెత్తించువానిని, అజ్ఞానమునకు మూలమైనవాడుగా దేవుడు వానిని గుర్తించి, వానికి కొన్ని యుగముల పాపమును అంటగట్టును. దానితో వాడు శాశ్వతముగా నరక బాధలను అనుభవించవలసివచ్చును. దేవుని దృష్టిలో అటువంటి వానికి ఎప్పటికీ క్షమాపణ ఉండదు. అందువలన ప్రపంచ విషయములలో ఎట్లున్నా ఫరవాలేదు. దేవుని జ్ఞానమువద్ద జాగ్రత్తగా యుండవలెనని తెలుపుచున్నాము.

**★★★ సమాప్తం ★★★**

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

**ఆధారమున్న ప్రతిదీ సత్యము కాదు,**
**ఆధారము లేని ప్రతిదీ అసత్యము కాదు.**

